[1]బొలిచె నపుడు సెలఁగెఁ భూరిభేరీముఖ, తూర్యములు నభంబుఁ దూఁటుకట్ట.

వ. చిందంబులమోఁతకు నిండు సందునుం దనుకించి భటులు గెలంకులం దాఁకఁ దోడ్తో నెఱసినయగ్గలిక నొండొంటి బెరయ మొగ్గరంబు లురవడించెను. 72

సీ. నిబిడఘంటావళీనిక్వణంబులతోడ, భీషణబృంహితఘోషములును
ఘననేమినిష్ఠురధ్వనుల[2]పొందునఁ గేతు, నిర్భరకింకిణీనినదములును
జటులఖురన్యాసపటురవంబులతోడ, నాభీలహేషానుహాస్వనములు
భూరిభుజాస్ఫాలనారావములతోడ, మేదురతరసింహనాదములును

ఆ. బరఁగి దిక్తటములఁ బగిలింప ననిమిష, ఖచరసిద్ధయక్షగరుడగణము
లంతరంగములు నితాంతకౌతుకభరితములు గాఁగఁ జూడ్కి[3]గములు వఱపె. 73

వ. ఇట్లు దలపడి యిరువాఁగును [4]బేరువాఁడిఁ బోరునెడ గరుడప్రహారంబుల నొచ్చిన పంచాస్యపన్నగంబులం బోని బాహుబలులను గాంభీర్యవిస్తారంబుల పెంపున సంపూర్ణచంద్రార్కకమలంబులం గ్రేణి సేయు నాననంబులను సంగ్రామరంగం బలంకృతం బయ్యె వాహనంబులమీఁద నుండి భూషణకిరణంబులు మెఱయ సైనికులు నేలం గూలునప్పుడు పుణ్యావసానకాలంబున నాకలోకపరిభ్రష్టం బగు మహాత్మలోకంబు చందంబు దోఁచెఁ జతురంగంబులును దనుతనుజాతిచేతం బడుటయు నేనుంగు లడరిన నరదంబులు నఱియుటయు నాశ్వికులు వోదివినం గములు ధరం దొరంగుటయు భటు లురవడించినం దురంగంబులు గడికండంబు లగుటయు రథంబులు గవిసినం గాల్బారు దుమురగుటయుఁ గ్రందున నెల్ల తెఱంగులు నన్ని దెఱంగులం గలయ బడలువఱుచుటయు రౌద్రరసంబుఁ [5]బెనిచె నానమయంబున సాత్యకి ధృష్టద్యుమ్న చేకితాన ద్రౌపదేయులు ప్రభద్రక చేది పాండ్య చోళ మగధ వంగాదిదేశంబులబలంబులతోడ బన్నసంబు సేసి తఱిమి రట్టియెడ. 74

ఉ. దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో పడ తేర దర్పదు
ర్దాంతగజాధిరోహణనితాంతసముజ్జ్వలభంగిఁ బ్రౌఢప
క్రాంతివిలాస మొప్పఁగ నఖండితపౌరుషుఁ డైనభీముఁ డ
త్యంతసముద్ధతిం గవిసెఁ బన్నదనీకము సంచలింపఁగన్. 75

క. ఉదయాచలమున రుచినం, పదఁ బోలు మహాతపనుఁ బ్రసరత్తీవ్ర
ప్రదరములు నెఱయ మెఱయఁగ, మదావళముమీఁద వెలిఁగె మారుతి యధిపా.

క్షేమధూర్తి యనురాజు భీముతో యుద్ధము సేసి చచ్చుట.

వ. అమ్మహావీరు నాలోకించి కులూతదేశాధీశుం డయిన క్షేమధూర్తి నిజబలంబులం బురికొల్పికొని యేచి క్రోచి యాహ్వానంబు సేసి తనకరటిం గొలిపిన నది గిరి

1 గ. బొదలినట్లు సెలఁగెఁ • జదల భేరీముఖ. 2. గ. తోడుతఁ గేతు. 3. క. తగులుపఱిచె. 4. క. బేరు వాఁడి-జ. బేరువాడ-ట. బేరువాడుచు-పంచాస్య. 5. క. బెరసె; జ. వేర్చె.

గిరిం దాఁకు తెఱంగున నతనిమాతంగంబునకు మార్కొనియె నయ్యిరువురు నొండొరులపైఁ దోమరస్తోమంబు లడరించి యార్చుచు నుద్దండపరాక్రమంబు లగు వేదండంబుల ప్రచారంబులు చారుభీషణంబులు గా నొక ళ్లొకళ్లం జుట్టు కొని వచ్చుచుం బెనంగి. 77

క. కోదండంబులు గొని బా, హాదర్పము లెసఁగఁ బోరి యన్యోన్యవ్యథన
చ్ఛేదంబులఁ బోరిఁ బోరి నా, పాదించిరి [1]రయము జనులు ప్రస్తుతి సేయన్. 78

వ. దానం గోపం బగ్గలించి. 79

తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ, బోరుచో భీమసేనుని పేరురముఁ
క్షేమధూర్తి సముజ్జ్వలతోమరంబు, [2]లేదు నాటించె దర్పంబు రూఢి కెక్క. 80

చ. అనిలతనూభవుండు దపనాంశునిభం బగు తోమరంబు వై
చిన నడుమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి వీఁక నా
తనిఁ బటుషష్టికాండపరితాడితదేహునిఁ జేయ మేటివిల్
గొని యతఁ డక్కులూతపతికుంజరముం వెసఁ గప్పె నమ్ములన్. 81

వ. అట్లు భీమసేనుండు గరూశపతివిక్రమంబు సరకుసేయక యతనిదిక్కునం జూడక క్షేమధూర్తిసామజంబును సాయకమయంబుఁ జేసిన నది మొగతిరిగి పఱచినం బోవనీక యప్పావని వెనుకొనుటయు నక్కులూతపతి ప్రయత్నంబున నమ్మాతంగంబు మరల్చి యాతనియంగంబునను దద్గజంబుశరీరంబునను నిశాతశరపరంపరలు వఱపె.

చ. ఉఱక సమీరసూనుఁడు దరదుగ్రధనుర్ధ్వనం బొనర్చి యే
డ్తెఱఁ గరి నొంప నాతఁడు గడింది మగంటిమి నొండువింట ను
న్నెఱుఁగులు [3]గ్రమ్ముకోల లతనిం గడు నొంచి తదీయహస్తి పా
ల్పఱి మహి మ్రొగ్గ నేసెఁ ధరాధిప నీబల మార్చె నుబ్బునన్. 83

మ. గద చేతం గొని దంతి డిగ్గి చని యాకొంతేయుఁ డప్పౌరు ను
న్మదమాతంగముఁ గూల నేసెఁ గృపాణస్ఫారదోర్దండుఁడై
కదియం వచ్చి యతండు నిష్ఠురగదాఘాతంబునం గూల్చె నే
పు దలిర్పం వెస నామరుత్తనయుఁ డాభూమీశు భూమీశ్వరా. 84

వ. ఇవ్విధంబున నేనుంగుపీనుంగుకడనుం బడిన క్షేమధూర్తి వజ్రప్రహారంబునం గూలిన కులశైలంబుసమీపంబున నిర్ఘాతపాతపతితం బయిన కంఠీరవంబుకరణి నొప్పె నతనిం గనుంగొని మనమొన వెఱచఱచినం బాండవబలంబులు వెనుకొనుటయు. 85

మ. పటుబాణప్రకరంబు లంబరముఁ గప్పం గిన్కఁ డాసేనఁ దాఁ
కుటయుం సైన్యము దైన్యముం దొఱఁగి మార్కొన్నం భుజాసంపదు
త్కటగర్వోద్ధురభంగిఁ బాండుసుతులుం దర్పంబు సొం పేర్పరిం

---

1. గ. రణము. 2. గ. రెండు...కట్టిగాఁగ; జ. లేదు...వేదు కెక్క; ట. లేదు...మాడి కెక్క; క. గ్రమ్ముకో నతని మే న్గడు.

చుటకుం జొచ్చిరఁ జేర్చిఁ బో రనిమిషాస్త్రామాద్భుతాపాది యై. 86

వ. అందు. 87

క. సూతతనయనారాచ, స్ఫూతిము లై వారణంబు లొలియును సొగయుక్
భూతలముపైఁ బొరలుఁ దెరలు, నే తూలును జిల్లిఁ దిరుగు విస్పుం జచ్చున్. 88

వ. అప్పుడు నకులుం డానికి మార్కొనియె భీమసేనుం డశ్వత్థామను సాత్యకి కైకేయు లగువిందానువిందులను శ్రుతసేనుం డనురాజు శ్రుతకర్ణను బ్రతివింధ్యుండు చిత్రుం డనుమనుజనాథుని ధర్మపుత్రుండు దుర్యోధనుని ధనంజయుండు సంశప్తకులను ధృష్టద్యుమ్నుండు గృపాచార్యుని శిఖండి గృతవర్మను శ్రుతకీర్తి శల్యుని సహదేవుండు దుశ్శాసనునిం దలపడి రట్టియెడ. 89

సీ. కైకేయులకును విందానువిందులు మహాహావము సేయంగ సాత్యకి యుద్ధ మునఁడు ఫేర్చి వారికార్ముకములు రెంటిని, దునిమి యంగంబుల నినిచెఁ దూపు లవ్వీరు లన్యశరాసన[1]నోద్ధారు లై, యతనిపైఁ బఱపిరి శరశరంబు లొడును వారు సునోన్యచాపచ్ఛిదా, వైచిత్రి నొప్పారి నేచి దొడ్డ

తే. విల్లు గొని యతిరయమున భల్లనిహతి, నాతఁ డనువిందుతల ద్రుంప నది ప్రదీప్త రత్నకుండలశోభాభిరామశిఖము, భంగిఁ దదనీకశోకసంపాది యయ్యె. 90

మ. కని విందుండు ప్రదీప్తచాపధరుఁ డై కాండప్రసారంబులన్ శనిసీరుం గుసుమాఢ్యకింశుకసముం జేయంగ సాత్యకి డా తనియంగంబులఁ బంచవింశతిశితాగ్రప్రంబుల్ వడిన్ గ్రుచ్చి నే పున వా రొండొరుసూతులం దునిమి నిష్ఫల్ రాలుకన్నోయితోన్. 91

తే. ఒకరు లొకరిఖలహయముల నుర్విఁ గూల్చి
యొండొరులకార్ముకములు ఖండితములు
సేసి తేరులు డిగ్గి రుద్భాసితాసి
చర్మశోభితహస్తు లై సరభసముగ. 92

వ. ఇట్లు పాదచారు లై మండలప్రచారంబుల నెఱయును. 93

క. చెరి బహుచిత్రగతులం, బోరంగా నొడ్డనములఁ బొలిసెం బలకల్
నేరమిమై [3]గళవుల శిని,వీరుం డిరువటియ గాఁగ విందుని వ్రేసెన్. 94

వ. ఇక్తైలంగున సయ్యురుప్రకరం జంపి సాత్యకి యుధామన్యు తేరెక్కి యుక్కున వేఱొ క్కరథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ శ్రుతసేనుండును నీమనుమం డగుశ్రుతకర్ణయుం బెనంగునెడ [4]నాశ్రుతకర్ణుఁడు. 95

క. ఆరాజు నైదువాలిక, నారసముల నొంప నతఁడు నవశరముల న
క్కారవుని సేసి నొంచెను, సారథి నైదింట నధికసంరంభమునన్. 96

---

1. గ. సోద్ధారు లై; జ. నధారు లై. 2. గ. భంగిఁ, బడియెఁ దదనీకశోకసంపాది యగుచు, 3. క. గళవుస. జ. గడవున. 4. క. నా శ్రుతకర్ణుఁడు.

సీ. శ్రుతికర్ణ గోపించి క్రూరనారాచము, జననాథుజత్రుదేశమున నాటఁ
బడి మూర్ఛవోయినఁ బైపయి వెండియు, నేయఁ దెప్పిలి యతం డేసెఁ గడఁగ
నుక్కునఁ దనునూడి సుకుమారుసిశిరా, సుతుఁ డొండొకచాప మెత్తి
తెఱచుటమ్ముల నేసు పెఱిగినచందంబు, నేసె రయంబునఁ జిత్రసేను
తే. నాతఁ డాతనియురమున శాతశరము
దూఱ నేయ నబ్బాలుండు దోఁచె వివిధ
బాణజాల మన్నరపతిశోణితమున
భల్ల మొక్కటఁ దల నేల డొల్ల నేసె. 97

ప్రతివింధ్యుఁడు చిత్రుఁ డనురాజుం జంపుట.

ఉ. ఏలినవానిపాటు గని యేడ్తెఱఁ దద్బల మొక్కపెట్ట యా
భీలతఁ జుట్టు ముట్టుటయుఁ బేర్చిన యుద్ధతిఁ దీవ్రసాయక
జ్వాలల నేర్చి యుద్భటభుజావిభవం బలరంగ నల్గడం
దోలె నుదాత్తవిక్రమకుతూహలి నీమనుమండు భూవరా. 98

సీ. అప్పుడు ప్రతివింధ్యుఁ డైదుబాణములఁ జిత్రునిమేను నొంచి తత్సూతునశ్వ
మునఁ గ్రూరశరములు మూఁడు నాటించి యొక్కమ్మునఁ గేతు వల్లార్చి పేర్చి
యతఁడు దన్నుఁ గ్రన్నన వాస్త్ర[1]పీడితుఁ జేయ, విలు ద్రుంచి వెసఁ బంచవిశిఖనిహతుఁ
గావించి శక్తి యుగ్రముగ వైచినఁ, బెలుచ నాలుగునుఱియలుగఁ జేసె
తే. సలిగి యాతండు గద వైచి యక్కుమారు
ఘోటకంబుల సూతునిఁ గూల్చె నదియు
పట్టుకొని వైచె మగుడ నప్పాండుపౌత్రు
చేయి వడి నుచ్చి పోవ నచ్చిత్రుఁ డడప. 99

ఉ. బాహువు నెచ్చినం గినిసి భాసురతోమర మెత్తి కౌరవ
వ్యూహము సంచలింప నతఁ డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద
ద్దేహము నుచ్చి పోవుటయుఁ దెళ్లె నరేశ్వర యవ్విభుండు వ
జ్రాహతిఁ గూలుపర్వతముతో నాకృతి నుత్కటవైకృతంబుగన్. 100

వ. ఇట్లు చిత్రుండు దెగటాఱినం గనుంగొని మనయోధులు ప్రతివింధ్యుపై నడరి యనేకాస్త్రశస్త్రంబులం బొదివినం బొలివోనికలితనంబున నేల కుఱికి యక్కుమారుండు గోదండటంకారంబున నంబరంబు పూరించుచు బాణాసారంబు పరఁగింపఁ బాండవసైనికులు బెట్టిదంపుటురవడిం గదిసి యతనికిం దోడ్పడుటయు మనవారలు వెన్నిచ్చి పఱచి రప్పు డశ్వత్థామభీమసేనులసంగ్రామంబు భీమంబుగు జెల్లె నందు. 101

క. గురుపుత్రుఁడు దొంబదిశిత, శరములఁ బావనిరథంబు సంవృతముగఁ జే

1. క. తాడితుఁ జేయ.

సెరయం బారఁగ సాయక, పరంపరలు వఱపె నతనిపై నతఁ డలుకన్. 102

వ. వాని మగిడించి. 103

క. అనిలజుఫాలము గురునం, దనుఁడు పటుప్రదరకీలితము సేయుడు నా
తనినిటలంబున నతఁడే, పున బాణత్రయము నాటె భూవరముఖ్యా. 104

వ. మఱియును. 105

చ. గురుసుతభీమసేను లతిఘోరవిధంబులఁ బోరి యొండొరుం
దెరలుప లేనిసామ్యమున దీపితులై లయకాలవిస్ఫుర
త్తరణియుగంబుఁబోలె శరధామసమగ్రతఁ బ్రజ్వరిల్లి యొ
ప్పిరి [1]రథచిత్రచారులఘుభీషణసంచరణంబు లొప్పఁగన్. 106

తే. వారి వీక్షించి ఖచరులు పోరు లెందుఁ,జూడమే దీని కెన యని యాడఁ గలదె
కలుగ వింకను వీరలబలముఁ జలము, నలఘు వెరవు నిట్లుండునే యనుచునుండ.

ఉ. ఒండొరు కేతువుల్ దునిమి యొండొరుసూతుల నొంచి యేపుమై
నొండొరు తేరివాహములయు బ్బడఁగించి నిశాతవిస్ఫుర
త్కాండచయంబు లొండొరులకాయములన్ వడి గ్రుచ్చి వ్రాలి రం
ప్పాండుసుతుండుఁ గుంభజునిపట్టియు మూర్ఛలు దమ్ముఁ గ్రమ్మినన్. 108

వ. ఇట్లు రథంబులపై నొఱగి మూర్ఛిల్లిన. 109

క. అనిలజుసారథియును గురు, తనయునిరథచోదకుఁడు నతని నాతనినిం
[2]గొని యుల్లంబుల బలితపుఁ,గనుకు సారఁగ నని కఁ దొలఁగఁ దోలిరి రథముల్.

ఉ. క్రీడితనూజుఁ డైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి దిక్కుల
ల్లాడఁగఁ బోరుచో శరము లా అయిదుల్ శ్రుతకీర్తి శల్యుపైఁ
గాడఁగ నేయ మూఁడుపటుకాండము లాతనిమేన గ్రుచ్చి సం
తాడితుఁ జేసె సూతు నిశితప్రదరంబున నాతఁ డుద్ధతిన్. 111

చ. నరతనయుండు దత్తనువు నాటఁగఁ దొమ్మిదియమ్ము లేసి స
త్వరముగ సూతునంగమున వాలికతూపులు మూఁడు నాటి ని
ష్ఠురశరపంచకస్ఫురణ జూపినఁ గోప మెలర్ప నమ్మహీ
శ్వరుఁడు గడంగి విల్ దునిమి సప్తశరంబుల నొంచె నాతనిన్. 112

వ. అట్టియెడ. 113

సీ. వేఱొక్కవిల్లెత్తి విష్వచ్ఛుకొడు కఱువదినాలుగమ్ములు వఱపె మద్ర
పతిమేన నతఁడు తోఁబడితూపు లడరించి, యేసె నవ్వీరుశరాసనంబు
ఖండంబులుగ వాఁడు గండడంగక గద, వైచినఁ బొడిసేసి యేచి శక్తి
నిగిడింపఁ దునుమాడె నిశితభల్లంబునఁ, ద్రుంచెఁ దదీయసూతునిశిరంబు

ఆ. వాయుజవములైనవాహంబు లప్పుడు, గలఁగి యరద మనికిఁ దొలఁగ నీడ్చెఁ

---

1. క. లఘుచిత్రచారపటుభీషణమార్గణభైరవంబు గన్. 2. క. గనుఁగొని యుల్లంబుల బలు, తొనరఁగ.

తెలిసి గాంచి శల్యుఁ డతిమత్తిఁ జొచ్చి కలంచెఁ బాండుసుతుబలంబు నధిప.

సీ. కమలాకరము లీలఁ గలఁచి యాఁడెడుగంధ, దంతావళముసముద్దండతయును
దర మిడి మృగసముత్కరము ఘోరంబుగా, వధియించుకంఠీరవంబు నేపు
సరసారణ్యంబు నిర్భరాటోపతఁ, గాల్చుదావాగ్నియుగ్రక్రమంబుఁ
బ్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ, యించుఫాలాక్షునిరయము దెలియును
ఆ. బోల్పఁ [1]బట్టు సయ్యె భుజగర్వశౌర్యప్ర, తాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య, హననకేళి సల్పునవసరమున. 115

దుశ్శాసనుఁడు సహదేవునితో యుద్ధంబు సేసి మూర్ఛిల్లుట.

ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు [2]మైగలి దుస్ససేనుఁ డుగ్ర
సీరులు పిచ్చలింపఁ బ్రజ విస్ఫురణం బొరి నార్వఁ బోరుచో
వారక సాయకత్రయము వాఁడిమి నయ్యువరాజు నొంచె వి
స్తారమనోజ్ఞహారలసితం బగునాఘనబాహువక్షమున్. 116
చ. ధృతి వొగడొంద నేచి సహదేవుఁడు నీసుతు శాతదీప్తస
ప్తతిశరవిద్ధుఁ జేసి నడిఁ దద్రథచోదకు మార్గణత్రయా
హతుఁడుగఁ జేయ నల్గి వెస నాతనిచాపము ద్రుంచి యాతఁ డు
ద్ధతి యలరంగ డెబ్బదిశిలాప్రదరంబుల మేను నొంచినన్. 117
సీ. నకులానుజుఁడు గృపాణంబున వైచిన, దుస్ససేనునివిల్లు దునియ లన్యో
న్యడ గని యవ్వీరుఁ డేచి బల్వింట మంటలు గ్రమ్మ మ్రేయుటయు నతండు
గడువెస నెత్తినకరవాలమును ద్రుంచి, యతనిపై లక్షించి యమ్ము లయ్యుదైవ
నకుమ యాతండు సలికిసఁ బ్రస్ఫీత, చాపంబు గొని చతుష్షష్టినిశిత
ఆ. కంకపత్త్రములను గడఁక నయ్యువరాజు, పరఁగఁ జేయుటయును బాండుతనయుఁ
డడఁచె నెక్కటొకటి నైదైదు తీవ్రశి, లీముఖముల బాహులీల మెఱయ. 118
వ. ఇట్లు విక్రమవిజృంభితుఁడై సహదేవుండు శతశాతశిలీముఖంబు లడరించిన. 119
చ. రయమున వాని నన్నిటి శరత్రితయంబునఁ ద్రుంచి సాయక
ద్వయమున నాతనిం బటునవప్రదరంబుల సారథిన్ భవ
త్ప్రియతనయుండు నొంచి దివి దీటుకొనంగఁ జెలంగి యార్వ న
త్యయసమవర్తిచాడ్పున నతం డుదితభ్రుకుటీవిలాసుఁడై. 120
మ. పటునారాచముదీప్తిజాలము నభోభాగంబునం బర్వ ను
త్కటవేగంబున నేయఁ గంకటము వక్షఃపీఠముం దూఱి న
త్తుటిపాం దేమియు లేక యుచ్చి చనినం దూగాడి యాతండు వ్రా
లుటయుం దేరు దోలంగ సూతుఁడు భయాలోలాకృతిం దోలినన్. 121
క. అస్మాద్రిపుత్త్రుఁడు వా, లమ్ముల దుశ్శాసనునిమహాసైన్యము రా

1. గ. బడిరొ నపుడు. 2. క. మైగలి-గ. మైగరి-చ. మైగవి-జ. మైగమి-ట. నగ్గలి-అ. ఘూరుఁడు.

ద్రమ్ముగఁ గలంచె దివిజగణమ్ము వినుతి సేయఁ దమమెుసలు నలి నార్వన్. 122

చ. నకులుఁడు సూతపుత్త్రుఁడుఁ బెనంగునెడన్ నకులుండు సూతపు
త్త్రకునకు నిట్లనుం దలఁచి దైవము నేఁడు నిజప్రసన్నదృ
ష్టికి నను బాత్రభూతుఁడుగఁ జేయుట గానఁగ వచ్చె నాదుచూ
డ్కికి నిను గోచరంబుగ ఘటించినయాచతురత్వసంపదన్. 123

క. కౌరవపాండవులకు నీ, వైరము నీవలనఁ గాదె వచ్చెను నిను మ
ద్ఘోరశరనిహతిఁ బడఁగ, న్నారఁ గనుంగొనక కోప మాఱునె యెుంటన్. 124

చ. అనఘుఁడు రాజసూతివి మహాస్త్రవిదుండవు నైన నీకు ని
ట్లనుట దలంప నర్హ మగు నైనను జెన్నటిపల్కు లేల నె
ట్టన భుజశక్తి మార్తురకుఁ డంక యడంచినఁ బల్కు లొప్పఁ గా
క నిలిచి చూపు నీచలముకల్మియుఁ జేతులబల్మియున్ దగన్. 125

వ. అని పలికి కర్ణుండు. 126

సీ. ఉబ్బి మాద్రీసుతు డెబ్బదిమూఁడుదూ, పులఁ గప్పుటయు నతఁ డలిగి యతని
[1]పైని శతనిశాతబాణంబు లేసిన, నాసూతనందనుఁ డక్కుమారు
ధనువు నుగ్గుగఁ జేసి తనువున ముప్పది, కాండముల్ నాటిపిన నొండువిల్లు
గొని డెబ్బదింట నాతని నొంచి మూఁడుమా, ర్గణములు సూతునంగమునఁ బఱపి

తే. భల్లమున విల్లు దునుమాడి యెల్లజనులు, నద్భుతం బందఁ ద్రిశతసాయకపరీతుఁ
జేసి నకులుండు నిష్ఠురహాసభాసి, తాననాంభోజుఁడై పొలుపారె నధిప. 127

క. సూతసుతుఁడు బలువిలు గొని, [2]యాతనిపక్షమున నాటె నైదమ్ములు ని
ర్ఘాతసమసప్తశరముల, నాతఁ డతని నొంచి విల్లు నఱిముఱిఁ ద్రుంచెన్. 128

వ. మఱియు నొక్కమహనీయకార్ముకంబు గొని కర్ణుండు గడంగి నప్పు డయ్యిరువురు నొండొరులతూపులు ద్రుంచుచు నిజమార్గణంబుల నొకళ్లొకళ్ల నెత్తుట ముంచుచుం బేర్చి విస్ఫులింగశిఖజాలంబు లడరించిన నంబరంబు శలభపటలసంవృతంబునుం బోలె నుండె నాసమయంబున నకులునగ్రభాగంబునకు వచ్చిన సోమకబలంబులు కర్ణక్రూరనారాచాదిబహుళబాణపాతంబులఁ బలాయితంబు లయ్యెఁ గర్ణునకు బాసటయై తఱిమిన కౌరవసైనికులు మాద్రేయరౌద్రవిజృంభణంబున దూరవిఘటితులై రట్లిరువాఁగును నెడ గలిగి చూచుచుండ నారథికోత్తము లుదారఘోరాకారంబుల నుల్లసిల్లి భల్లప్రముఖప్రదరంబులఁ బరస్పరాంగంబులం బొదివి యంబుదపిహితమూర్తు లగుమార్తాండశశాంకులచందంబు నొంది యన్యోన్యదివ్యాస్త్రతేజోవిలాసంబుల నయ్యయస్త్రంబుల వారించుచుం బోరి రట్టియెడ. 129

క. అలుక వొడమి కర్ణుండు న, కులుచాపము ద్రుంచి సూతుఁ గూల్చి తురంగం

---

1. క. పై నశీతినిశిత. పై నవతినిశాత. 2. అ. యాతనియక్ష్యముల.

బులఁ జంపి చక్రరక్షుల, తలలు నఱికి సిడము ద్రుంచి దరహాసముతోన్. 130

వ. మెఱసినం గుపితచిత్తుం డై. 131

చ. పలకయు వాలునుం గొని యొకింత బాండుకుమారుఁడు పెక్కుచెక్కు లై
యిలఁ దొరఁగంగ చేసె గద యెత్తినఁ ద్రుంచె రథంబు డిగ్గి యు
జ్జ్వలపరిఘాభిరాముఁ డయి వచ్చిన నప్పరిఘంబు రూపుమా
పి లసితలాఘవస్ఫురణపెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్. 132

ఆ. నుర్గభేదన తెలివిమార్గణంబుల కోహ, టించి సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి
యెల్లజనులుఁ జూడఁ బొల్లుదినంబున, కోర్చి యక్కుమారుఁ డోడి పాఱె. 133

కర్ణుఁడు నకులుని విరథుం జేసి యవమానించుట.

క. వెనుకొని రాధేయుఁడు నిజధను వాతనికంధరమునఁ దగిలిచి నవ్విం బ
ట్టిన నిండినచాప[1]పరిగతి, ఘనాకృతిని బోలిచె నతఁడు కౌరవనాథా. 134

వ. ఇట్లు పాండుతనయుం బాడుదలఁ బట్టి మందస్మితసుందరాననుం డై. 135

క. పలుకులు వృథగా నన్నుం, బలికితి మున్నింక నెన్ని పలుకక వలసిం
బలుకుము నీకేఁ దగ నా, యలవుఁ జలము నీ వెఱింగి తలఁతియ చాలున్. 136

క. అల వెఱఁగి పెనఁగు పెనఁగం, దలఁచిన నది గాక సిగ్గు దలకొని యనికిం
దొలఁగుట యింకిట దగు వి, చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా. 137

క. అని విడిచె నకులుఁ గుంతివ, చనములు దృఢవృత్తిఁ జిత్తసంకలితము లై
యునికిం గర్ణుం డతఁడును, జని ధర్మజునరద మెక్కె సవ్రీడముగన్. 138

వ. ఎక్కి నిట్టూర్పు నిగుడం గుంభనిష్ఠ్యూతభుజంగంబుచందంబున నుండె నివ్విధంబున మాద్రీపుత్త్రమానమథనవిజృంభితుం డగునవ్వీరుం డప్పుడు మధ్యందినగతం బైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుం బోలెఁ బ్రదీప్తమూర్తి యై వెలిమావులును వెలిపడగయు నుల్లసిల్ల శోభిల్లుతేరు రథంబు రయంబున దర్శనీయంబుగాఁ బాంచాలబలంబు దఱిసి పెక్కుతెఱంగుల మెఱుంగుటమ్ములగములు గదియించి.

సీ. సూతులఁ దెగటార్చి కేతనంబుల పీట, [2]తాటంబు సేసి రథ్యములఁ గూల్చి
చామరచ్ఛత్త్రభూషణములు పొడిసేసి, [3]రథికజనములశిరములు ద్రుంచి
కొమ్ములు నఱికి యంకుశములు దునిమి తోండములు ఖండించి కుంభములు వ్రచ్చి
జోదులతనువులు భేదించి మోరలు, [4]గళ్యాలతోడఁ జెక్కలుగఁ జేసి

ఆ. కందములు పగిల్చి కాళ్లులు ద్రెంచి యాశ్వికులఁ జంపి చర్మవిశిఖకుంత
ముసలముద్గరపట్టిముఖసాధనములు భగ్నములు సేసి భటుల సమయఁ జూచి.

వ. బాహువిలాసంబు మెఱయ నెఱయం బొలిచె భవత్సుతుం డగుయయుత్సుం డను

---

1. గ. పరివృత. 2. జ. తాటనంబులుగ రథ్య. 3. గ. రథికశిరంబులఁ బృథివిఁ గూల్చి. 4. చ. గల్లెలుగూడఁ జెక్కలుగ- జ. గళ్లెలు చెక్కలుగాఁగ-ట. గళ్యాలు చెక్కలు గాఁగ.

పర్వతప్రతిముం డగుచులూకుపయిం గవిసి కులిశనిభం బగువిశిఖంబున నొంచినఁ
గోపించి యాబల్లిదుండు విల్లు విఱుగ నేయుటయు నక్కుమారుండు. 141

తే. మేలువిలు గొని యఱువదినాలుగమ్ము
లతనిమెయి గ్రుచ్చి సాయకత్రితయనిహతి
సూతు నొప్పించి మఱియు నిశాతశరచ
యమ్ము పరఁగించె నధికరయమ్ము మెఱయ. 142

వ. దానం గనలి. 143

క. బలువిడి నులూకుఁ డిరువది, శిలీముఖము లొడలఁ జొనిపి సడిసను రయమునై
నిలఁ గూల్చిన నినుతుఁ డుజ్జ్వలవిశిఖము లయిదు నాటె వానియురమునన్. 144

వ. నొచ్చి యాసౌబలనందనుండు క్రోధంబు రూపంబు దాల్చినవిధంబున విజృంభించి. 145

శా. భల్లం బొక్కటఁ ద్రుంచె సూతునిఁ జతురశ్వాణాహాలిఁ వాజులన్
డొల్లం జేసె నిశాతపంచవిశిఖాటోపంబునం జించెవి
ల్లోల్లాసంబు వికాసముం బొరయ మేను[1]క్కఁడి నీనందనుం
డెల్లం జూడఁగఁ బాఱె నొండొకరథం బెక్కంగ నుగ్రాసుణీ. 146

క. గెలుపున నొయి పొదలఁగ సౌ, బలసూనుఁడు రథము నెక్కి పాంచాలబలం
బులు గలఁగఁ బఱచెఁ దెఱంగుల, యలుఁగుల విహరించె నుద్భటాటోపమునన్. 147

సీ. శ్రుతకర్మ నకులుని సుతుని శతానీకుఁ, దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి
సూతునిఁ బరిమార్చి నాతఁడు గద వైచి, రథవాహనములు సారథిని గేల
నముఁ బొలియించె భూరమణ యిమ్మెయినీసుతతనయుండు సకులనందనుండు విరథు
లై యొండుదేసల కరిగిరి [2]సుతసోముఁ, దలపడి కసిమి గాంధారనాథుఁ

తే. డతనియడరించువివిధసాయకము లెల్లఁ
దునిమి బాణత్రయంబున [3]దనువు నొంచి
తురగముల నరదమ్ముఁ గేతువుఁ గిలక
మాణశకలంబులుగఁ జేసె మద మెలర్ప. 148

మ. విరథుం డై పొలివోనిబీరమునఁ బృథ్వీభాగసంచారి యై
శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా నీమఱిం
దిరథం బెట్టెఱఁ గప్పినం దునిమె నుత్సేకోగ్రుఁ డై యమ్మహీ
వరుఁ డబ్బాలునిచాపదండము భుజాటోపప్రసంభ మేపారఁగన్. 149

చ. అతఁడు ప్రదీప్తఖడ్గము రయంబుమెయిం గొని యానృపాలుఁ డు
ద్ధతిఁ బరగించుసాయకశతంబులు ద్రుంచుచు నుల్లసిల్ల న
ప్పతి పటుభల్లఖండితకృపాణునిఁ జేసిన నీడఁబోక చే

---

1. క. నుక్కాఁడి. 2. జ. శ్రుతసోము. 3. ఙ. ధనువు.

తితునియ బెట్టు సైచె జగతీవర యాతనివిల్లు రెండుగన్. 150

వ. ఇట్లు కోదండంబు దుండంబులు సేసి తొలంగి యక్కుమారుండు శ్రుతకీర్తిస్యందనం బెక్కె సౌబలుండు వేఱొక్కవిల్లెత్తి యస్త్రఁబి నురవణించి పాండవరథికులం గలంచెఁ గృపాచార్యధృష్టద్యుమ్నులు పెనంగునెడ గౌతముండు పాంచాలవరుం బొదువునాటోపం బాలోకించి యక్కౌంతేయసైనికులు దమలోన. 151

ధృష్టద్యుమ్నుఁడు కృపాచార్యునితోఁ దలపడి నోడి పోవుట.

ఉ. ద్రోణుపరాభవం బధికరోషము సేయఁగ నున్నయీతఁ డీ
క్షోణిపరాక్రమంబు విలసిల్లఁగ నిగ్రహదాత్తజుఁ గాఁగ
ప్రాణునిఁ జేయఁ గే లుడుగుఁ డీ బైకొను నంతటఁ బోక విస్ఫుర
ద్బాణవిలాసముల్ నెఱపుఁ గాదె మనసైన్యము దల్లడిల్లఁగన్. 152

వ. అని వెండియు. 153

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుబలగర్వశ్లేషనిర్వాహకుం
డరులం జీకిఁ జేకొనం డితఁడు [1]క్రోధాత్తాత్ముఁడై నేఁడు ని
ర్భరశౌర్యంబు నుదాత్తధైర్యము నుదగ్రస్ఫూర్తి శోభిల్ల దు
స్తరదర్పోద్ధతిఁ దేక యున్నె మనలం గాదా నేలకుం గోలకున్. 154

వ. ధృష్టద్యుమ్నుండును బెండువడి యున్నవాఁ డనుచు నందఱు రట్టియెడ [2]బెట్టిదంబు లగుకృపాచార్యుతూపుల యేపు రథ్యంబులఁ గొంచి సారథిఁ గ్రొవ్వడంచి యాద్రుపదనందనుతనువు నెత్తుటం దోఁచి యుల్లంబు గలంచె నప్పు డాతనిసూతుం డతనితో నిట్లనియె. 155

చ. వినుము కుమార విప్రభుజవీర్య మవార్యతఁ దేజరిల్లెడుం
జనవు భవత్సమగ్రశరజాలము లీతనిమీఁద దైవసం
జనితము సువ్వె యియ్యెడరు సంగర మిట్టిద తొల్లి యెందు నా
కనినది లేదు తేరు దొలఁగం గొని పోవుట కార్య మిత్తఱిన్. 156

వ. నీయట్టివానివిక్రమంబును దిట్టినయట్లు సమయుటం జేసి యిమ్మహాత్ముఁ డవధ్యుం డని నిశ్చయించితి నామాట కియ్యకొను మనపుడు నాపృషతపౌత్రుం డిది యట్టిద యని నిశ్చయించి పలికి మఱియు హీనస్వరంబున నిట్లనియె. 157

చ. చరణములుం గరంబులును సంచలభావము నొందఁ జొచ్చె మేన్
విరవిరఁ బోవుచున్నయది విహ్వల మయ్యె మనంబు నీతలం
పరయఁగ మేలు మారుతసురాధిపసూనులలోన నల్ల నో
క్కరుదెసకై రథంబు దొలఁగం గొని పొమ్మడిబీర మేటికిన్. 158

చ. అనపుడు సూతుఁ డెంతయు రయంబునఁ దేరు వృకోదరాంతికం
బున కెగవంగ శంఖరవముల్ గుణనిస్వనముల్ నిగిడ్చి యే

1. గ. క్రోధావిష్టుఁడై. 2. గ. బెట్టిదంబు గాఁ గృపాచార్యుం డేపు మాపి రథ్యం.

పునఁ గృపుఁ డుజ్జ్వలప్రదరపుంజములం బరఁగంగఁ జేయుచున్
వెనుకొని పొల్చి నిల్చె గిరి వెన్కని నిల్చినవజ్రికైవడిన్. 159

తే. కడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగు, చుండి శరపంచకంబున నురము నొంప
నతని నయ్యాదవోత్తముఁ డలఘుషష్టి, విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగ నేసె. 160

క. ఒండుశరాసన మెత్తి శిఖండి గుఱియునవతిసాయకమ్ములు పెలుచన్
ఖండించె నతఁడు తెక్కఁ, దండం బా ద్రుపదనృపతితనయుఁడు నఱకెన్. 161

క. ధనువు దునిమి కొమ్ములు మురిసినవృషభముచంద మగుచు శీఘ్రస్ఫురణం
దనువున శితశరములు వడిఁ, జొనిపి యతం డతని గళితశోణితుఁ జేసెన్. 162

చ. అలుక మనంబునం గదిరి యాదవసత్తముఁ డొండువింట దో
ర్బల మెసఁగంగ డెబ్బదిశరంబుల[1] వాఁడిమి మేన రక్తధా
రలు దొరఁగించి పెక్కుప్రదరంబులు పైపయి నేయు చుండ న
గ్గలికఁ బెనంగె వెండియు శిఖండి విచిత్రరథప్రచారుఁ డై. 163

వ. ఆద్రుపదనందనుండు జత్రుదేశంబున నంబకత్రయంబు నాటించిన. 164

శా. క్రూరోల్లాసము పల్లవింపఁ గృతవర్మం డుగ్రదీప్తిస్ఫుర
న్నారాచంబులు పెక్కు లొక్కమొగి మేనన్ గ్రువ్వ మూర్ఛిల్లె న
వ్వీరాగ్రేసరుఁ డప్డు సారథి భయావిర్భావదీనాత్ముఁ డై
తే రచ్చోటు దొలంగఁ దోలుటయుఁ భీతిం బాఱెఁ దత్సేనయున్. 165

వ. వివ్వచ్చువిక్రమవిహారంబున కోర్చి శిబిత్రిగర్తసాల్వసంశప్తకసైన్యనారాయణ
గోపాలోపేతుం డై సత్యసేన చంద్రదేవ మిత్రదేవ మిత్రవర్మ సౌశ్రుతి సువర్మ
సుశర్మాదు లగుసోదరసుతులు బాసటగాఁ ద్రిగర్తపతి పెనంగునప్పుడు. 166

సీ. సత్యసేనుఁడు మూఁడుసాయకంబుల మిత్ర, దేవుండు షష్టిసందీప్తమార్గ
ణంబులఁ గ్రూరబాణంబులు మూఁటను, జంద్రదేవుఁడు శరసప్తకమున
మిత్రవర్ముఁడు గంకపత్రత్రిసప్తతి, [2]సౌశ్రుతి యేడునిశాతవిశిఖ
ములను శత్రుంజయుఁ డలఘువింశతికాండ,ములను సుశర్ముఁ డుజ్జ్వలనవాస్త్ర

తే. ములను గప్పి రప్పార్థు నాఁబలియుఁ డంబు,దములధారలు వొదువ నుదాత్తరేఖ
గరము పొలుపారు మేదినీధరముభంగిఁ, దలఁపఁ బట్టగుధీరతఁ బొలిచె నధిప. 167

వ. ఇట్లు సుస్థిరుం డై మిత్రదేవునంగంబునఁ గంకపత్రశతంబును సత్యసేనుతనుప్రస
మార్గణత్రయంబును సుశర్మమిత్రవర్మలశరీరంబుల శిలీముఖాష్టకనవకంబులను
బఱపి శత్రుంజయు శిలాశితశరంబులం బడ వైచి సౌశ్రుతిం బంచవింశతికాండం
బుల గీటడంగించియుఁ జంద్రదేవుని నెనిమిదియమ్ములం దునిమి యుల్లసిల్లిన. 168

చ. కనకపుఁగామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనా
భునిభుజశాఖ యుచ్చి చన భూరిబలుం డగుసత్యసేనుఁ డు

1. గ. సాతనిమేన. 2. జ. సామ్యుగ్యుఁ డేడు.

ష్కన నిగిడింపఁ జేతిమునికోలయుఁ బగ్గములు౯ మహీతలం
బున నొగలందునుం బడిన భూవర పార్థుఁడు క్రోధదీప్తుఁ డై. 169

క. హారిదెసఁ గన్గొని యాతని, యరదముఁ గదియంగ నడుపు మరద మనుడుఁ జె
చ్చెర నొండొకమునికోలం, గర ముద్ధతి నడపె ఘోటకంబుల నతఁడున్. 170

క. తే రతనియరదమునకుం, జేరువ యగుటయును గ్రీడి శితబహుభల్ల
స్ఫారగతుల గాత్రశిరో,దారణ మొనరించి యొప్పె దరహాసముతోన్. 171

వ. ఇట్లు సత్యసేనుని జిత్రవధంబు సేసి. 172

చ. ఘనతరవత్సదంతశరఘాతముసం బడ వైచి మిత్రవ
ర్మని రథసూతు [1]నట్టి దొకక్రూరపుఁదూపున నుర్విఁ గూల్చి నా
తని సముదీర్ణ మై పెలుచఁ దాఁకి త్రిగర్తబలంబు సుట్టు ము
ట్టిన వివిధోగ్రసాయకపటిష్ఠత నొప్పి కలంచె నేపునన్. 173

వ. వెండియు సుశర్మనిజజ్ఞాతులు పోక పెనంగిన. 174

ఆ. వెండిపింజఁ బొలుచు వెడఁదయమ్మున మిత్ర,సేనధరణినాథుశిరముఁ ద్రుంచి
వాఁడినారసమున [2]సుశర్మనికునికిట, నాఁటె నయ్యమర్త్యనాథసుతుఁడు. 175

వ. అట్టియెడ సంశప్తకగణంబు లన్నియు నార్పులు నింగి ముట్ట నలుదిక్కులం గిట్టి పెట్టిదంబు లగునస్త్రశస్త్రపరంపరలు గురిసిన నమ్మేటివిలుకాఁ డలుకనూనినయలంతినవ్వుచెలువంబు మొగంబునకు వింత చెన్నొసంగ విజృంభించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది ప్రదీప్తభల్లాంజలికప్రముఖంబులం బరఁగుటయు. 176

సీ. తేరులచెక్కులు వారణంబులఖండ,ములు భూషణంబులపొడియు ఘోట
కంబులతునియలుఁ గరవాలతోమర, శరపరిఘాదులశకలములును
రథికజనంబులనయ్యాలుఁ జామర, చ్ఛత్త్రకేతువులయంశములు భటుల
తుమురుగు [3]రావుతులతుండంబులును గింకటములభాగములుఁ జిందములనుఱుముఁ

తే. గలసి నెత్తుట మునిఁగి ప్రేవులఁ బెనంగి, మెదడు బ్రుంగి వియచ్చరహృదయములకు
నద్భుతంబు బీభత్సంబు నావహింప, సంగరాంగణ మతిఘోరభంగి యయ్యె. 177

వ. అప్పుడు. 178

క. కరిహయశవముల విఱిగిన, యరదంబుల విషమ మైనయాజిక్షితి నె
త్తురురొంపిలోన రథ్య, స్ఫురణకతనఁ దప్పులఁబడక శోభితగతి నై. 179

దుర్యోధనుఁడు ధర్మజునితో యుద్ధంబు సేసి విరథుఁ డగుట.

తే. నరుఁడు దీవ్రశరార్చులు పరఁగఁ జేయఁ
గలఁగి హతశేషసంశప్తకవ్రజంబు
పలుగడల విచ్చుటయుఁ బొగ వాసి మెఱయు

1. క. బిట్టదరఁ గ్రూరపు. 2. ఖ. సువర్మనిఃఖుకిట. గ. సువర్మనికుత్తుక. 3. జ. రావుతుతుండం.

నగ్నియునుబోలె వెలుఁగొందె నాతఁ డధిప. 180

ఉ. కౌరవరాజు ధర్మజుఁడుఁ గయ్యము సేయు నెడం గడంక మైఁ
గౌరవరాజు ధర్మజుని కాయమునన్ నవసాయకంబులన్
సారథిమేన నొక్కపటుసాయకమున్ నిగిడింప నాతఁడు
న్ఘోరతరాత్ముఁ డై యతని నొంచెఁ ద్రయోదశసాయకాహతిన్. 181

వ. నొంచి త్రోడన. 182

తే. తునియలుగఁ జేసె హరులఁ జతుశ్శరముల
సూతుఁ బంచమమున ఘనకేతుయష్టి
షష్ఠమునఁ జాపదండంబు సప్తమమున
నలిగి యెత్తినకరవాల మష్టమమున. 183

క. ఆలోచన యజ్ఞసపతి, వాలికనారసము లైదు వక్షమున నడిచి
గీలించి ధైర్యసారము, దూలించినఁ దొలఁగి నీసుతుం డిల కుతికెన్. 184

చ. వికలరథప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్రక
ర్ణకృపులుఁ దక్కనుం గలుగునాయకులున్ రయ మారి వచ్చి కూ
డికొనుట సూచి యెంతయు వడిం జనుదెంచిరి ధర్మసూనుపాం
తికు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతుకంబునన్. 185

వ. ఇత్తెఱంగున నపరాహ్ణంబున దొరలయుత్తంబు లొక్కదెసకుం దార్కొనిన నుభ
యబలంబులు నురవడించి కలయన్ బెరసినం గ్రందుకయ్యం బయ్యె నందుఁ జందం
బుల మ్రోఁతయు నార్పులయులివును బాణకృపాణాదిహేతిసంఘట్టనంబునం బుట్టు
రణనంబును రథావయవాస్థికపాలభంజనంబున నెసంగునినదంబునుం గూడి పరఁగిన
దిక్కులు పిక్కటిల్లెఁ గిరులకొమ్ములం జిక్కి వ్రేలుతురంగంబులును సందుకొని
వచ్చినసుభటులు [1]సెదివిన నొఱిగి కూలుశుండాలంబులును నాశ్వికులమొగంబునం
బడి లులాయంబులు సొచ్చినసరోవరంబులచందం బగుకాల్బలంబులును రథికులు
వోక పెనంగిన నణవఱ లయినయరదంబులును నెత్తురుకాలువలును గండలతిట్ట
లును బ్రేవులప్రోవులును నెమ్ములరాసులును నత్యంతరౌద్రంబు నావహించె నను
టయు నాంబికేయుండు. 186

చ. సమరము[2]పెంపు సెప్పెదవు సంజయ చెప్పవు నీవు నీమహీ
రమణునిభంగి ధర్మజుశరంబులచే విరథత్వ మొంది మా
నముఁ జలముం దెగం దొలఁగెనా మగుడం బురికొంట లేదె ని
క్కము సెపుమా తనూజభుజగర్వవిహీనత నొంచెఁ జిత్తమున్. 187

వ. అనిన నాసూతనందనుం డమ్మానవపతి కి ట్లనియె. 188

తే. విరథుఁ డయ్యెన కాని యక్షీణుఁ డాహ, వంబు దక్కక యొండురథంబు వన్ని

1. జ. వొదవిన. 2. గ. పొంపు.

కొని సముద్ధతి వచ్చి సక్రోధుఁ డైన, మనమునఁ సూతునకు నిట్టు లనియె నధిప.

ఆ. [1]తెల్లసీవిరులును వెల్లనిగొడుగు నై, యల్లవాఁడె పాండవాగ్రజుండు
మెఱసియున్నవాఁడు పఱపు మచ్చోటికి, రథము ఘోటకములరయము మెఱయ.

వ. అనుటయు నతండు నట్ల చేయ నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహీ
కేతుసహితం బై వచ్చుచున్నధృతరాష్ట్రనందనస్యందనంబునకు సమ్ముఖంబుగా
మనరథంబు నడుపు మనుటయు నాతం డవ్విధం బాచరింప నయ్యిరువురు రతిరథ
కులకుఁ బ్రకటప్రధనం బయ్యె నట్టియెడ. 191

సీ. పాండవుచాపంబు ఖండించె నీకొడుకు, కొండొకధను వెత్తి యుఱక యాతఁ
డక్కురునాథువిల్ తెగ ద్రుంచె నను మాటె, నతఁడు వేఱొకవింట నతని నేయ
నయ్యుధిష్ఠిరుఁడు నానాస్త్రంబు లేసిన, నాచ్ఛాదితం బయ్యె నంబరంబు
వారొండొరుల రక్తధారాప్లుతులఁ జేసి, ఫుల్లకింశుకభంగిఁ బొలిచి రేచి

ఆ. ఘోరశక్తి వైచెఁ గౌరవపతి యది, నడుమ నునిమి ధర్మనందనుండు
నొంచె నిశితవిశిఖపంచకమ్మున సమ్మహీశునురము దర్పమునక మునఁగ. 192

వ. ఇట్లు కౌంతేయముఖ్యచేత నొచ్చియు గాంధారీనందనుండు. 193

చ. బరనస మొప్పఁ గ్రూరనవభల్లవిదారితుఁ జేసె సమ్మహీ
శ్వరు నతఁ డల్గి బల్విడుగుచాపవిశేలిముఖ ముద్వ్చి పోన న
క్కురుపతి నేయఁ గయ్యమునకుం దొఱ యప్పుడు చేయువాఁడు గా
నగదము పట్గ నాతఁడు గదాకిలనొప్పటబాణ వండుఁ డై. 194

క. డిగి రయమునఁ గగసిన నా, జగతీపతి యేచి యుగ్రశక్తి నురము వె
ట్టుగ వైచిన నతనయుఁడు, వగచెంగి రథి మక్కి వింట మూర్ఛనువాఁ డై. 195

దుర్యోధనుఁడు ధర్మజుతో యుద్ధముసేసి మూర్ఛిల్లుట.

క. అత్తఱిఁ గడుఁబెల్లుగఁ గ్రా, న్నెత్తురు నడియుటయు నతఁడు నిర్భరమూర్ఛా
యత్తుఁ డగుడుఁ గృతిసఖ్యుఁ డు, దాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్.

ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్పు బలంబు మాగుత్
ధూతపయోధివోల వడిఁ దోడ్పడియెం గృతిన ర్క కింశు ను
ద్యోతితభంగి వచ్చి విజయుండు వెసం దనుమాడె లీలఁ
జేతులతీఁట వోవ రథసింధురవాజిభటోత్కరంబులన్. 197

వ. అంత. 198

క. కురుపతి దెప్పిఱి బాహు, స్ఫురణంబు వలెర్ప నింద్రసుతుని మార్గణ ని
ష్ఠురవివిధవిశిఖవినిహతి, శరీరుఁ జేయుటయు నతఁడు సక్రోధుం డై. 199

తే. కార్ముకముఁ గేతువును ఘోటకముల సూతు
వెడఁదబలుతూపు లేడింటఁ బుడమిఁ గూల్చి

---

1. క. తెల్ల సైనసిడము ♦ తెల్లనిగొడుగు నై.

నాథునిం బ్రశంసించుచుం జని యివ్విధంబున నుభయసైన్యంబులు నిజశిబిరంబుల
కరిగి విశ్రాంతుంబు నొందె నని చెప్పుటయు సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె.

ఉ. తెల్లము నిమ్ము నందఱ వధింపఁగ నయ్యమరేంద్రనందనుం
[1]డొల్లక పోక వాఁడు దనయుగ్రత సూపెన నన్ను మీఁదమీఁ
దల్లఁగు[2]వారికేల యమసన్నిభులకైనను మాపుకోఁడఁ బోఁ
[3]తెల్లను గాన తద్భుజవిశేషము హాస్యము గాదె సంజయా. 210

సీ. యాదవసారథ్యయంబునాఁ దొనస్యముద్రేక ముడిచి సుభద్రఁ దెచ్చె
ఖాండవం బాహుశక్తిగా లీల నొసరించి, సప్తార్చి నత్యంతతృప్తుఁ జేసె
శబరవేషముఁ దాల్చి చనుదెంచి తొడరిన, శివునిఁ గ్రక్కున బెనఁగి మెచ్చించె నతని
గంధర్వుచేపట్టుకొనిపోవు నన్నును, విడిపించె లావును వెరవు మెఱయఁ

ఆ. గాలకేయకులముఁ గాలుని ప్రోలికి, ననిచె నఖిలనృపుల ననికి నొక్క
కొలిపెఁ గ్రీడి [4]జగము గొనియాడ నేకకోదండచండవిలసితముగఁ గాదె. 211

వ. కావున మనవారికి నోటమి యక్కిరీటివలనం గలిగె ననుచు వారి గర్హింపం
దగ దట్టిపట్టి కోడం బెనంగుటఁ బ్రశంసకుం దగుననుచు పదంపడి వా రేమి సేసి రనిన
ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 212

ఆ. [5]ఎల్లు దివిసి పోయి యేటుఁ బోటు నొడళ్లఁ, గలయఁ గలిగి డప్పి గఱచి సురియు
దొరలుఁ దాను నపుడు దుర్యోధనుఁడు విచారాభియుక్తి నున్న యవసరమున.

వ. పార్థుదెసఁ బలుకు పుట్టినం గ్రోధంబున నూర్పులు సందడింపఁ గర్ణుండు [6]భగ్న
దంష్ట్రంబయి విషంబు లేని భుజంగంబునుం బోల్పం నగి పరాజయంబు నొంది
దీనదశకు వచ్చి యున్నమహారథికవరులం గలయం గనుంగొని కౌరవేశ్వరున కి ట్లనియె.

ఆ. అలవు వెరవుఁ దలఁపఁ గలఁ డితం డన వాఁడు, కెక్కి నట్టియోధకుఁ డక్కిరీటి
నలయునెడల నతని వాసుదేవుండు బోధించు నెల్ల తెఱఁగుఁ దేటపడఁగ. 215

క. అనిమిషనాథుం డిచ్చిన, ఘనశక్తికి నసురఁ గొడ్డి గాండీవిఁ దొలఁగిం
చినహరి వంచన పదపడి, మన మెల్లను దెలియ వినుము మనుజాధీశా. 216

క. అగుఁ గాక యతని నాతని, మగఁటిమియును నేర్పు నెల్ల మాన్చెద నీకుం
బగ యనియెడుమాటయు ని, జ్జగమునఁ గలుగంగ నీను జగతీనాథా. 217

### కర్ణుని రెండవ నాఁటి యుద్ధము.

వ. అనిశం బ్రియం బంది నీనందనుం డతని దగువారలను నిజనివాసంబులకుం
బోవం బనిచి తానును నభ్యంతరమందిరంబున కరిగి నారాత్రి సుఖనిద్ర సేసి

---

1. గ. డొల్లక పోయె.-జ. డొల్లఁడు గాక. 2. క. వారికే శమనసహ్యు.-జ. ఁడే యొకిన్ను యను.
3. గ. జెల్లును. 4. క. గుణము. 5. జ. ఇట్లు...యేటుఁబోటు లాడఁడొల్ల. 6. ఇది పెక్కిటఁ గానరాదు.

కేపకడ సమస్తజనంబులు సంగ్రామంబునకు నడచి రంత నక్కడ నున్న మిగిలి పాండవబలంబులుం దోతెంచె ధర్మనందనుండు బృహస్పతిసమానం బైనమర్జ్యయ వ్యూహంబు పన్నించినం జూచి మనవారును దానికిం బ్రతిగా మోహరించుట కై రాధేయురాకకు నెదురుచూచుచు నొకభంగిం బన్ని రనిన విని యాంబికేయుండు.

క. శీతార్తజనంబులు ప్రద్యోతనునుదయంబు గోరుచున్నకరణిం దా
నే తేరం గోరుజనులకు, నాతండు నిజతేజమునం బ్రియం బొసఁగెనొకో. 219

ఉ. అమ్మెయి ధర్మనందనునియగ్గలికం దొలునాఁడు రాజు బ
న్నమ్ములపాటు సూచుచు రణంబుకడంక దొఱంగి చన్నబా
ఱమ్మెయి నద్రిగంబున సరోహిసపరాక్రమలీల సూపెనో
యమ్ము నెఱుంగ రేమియు సరోజముసు నాతండు నేమి సేయుగాన్. 220

తే. కర్ణుఁ బెట్టు కిలనఁ గౌంతేయవర్గంబుఁ, గృష్ణయుతిను గాఁగఁ గెలువఁ జాలు,
నేమి సెప్పఁగిలుగ నిమామానసోత్రుని, చిత్తమూర్ప్య నతనిఁ గెలువఁ గున్నె.

క. సౌబలునీతియుఁ గర్ణుభు, జాబలమును గూర్చి తనకు సామ్రాజ్యం బేఁ
గా బలసి వెలయువాఁ డై, యాజి లగాఱడు సుతుంబులు నంద్రోగాన్. 222

క. జూదంబునాఁడు మొలచిన, యాసుగ్రసి పెరిఁగి సాదయరా సిగ్భినసాః
క్షోదయపరంపరాసా, పానిని యై నానసు నిట్లు గెఱిగొనియొసిసే. 223

క. దుర్యోధనుచేసినయవ, కార్యంబుఁ వచ్చినట్టికష్టంబులు దా
త్పర్యంబున వినిమొదఁ బ్రతి, కార్యంబులు [1]గామి మనసు గగదుచు నుండెన్. 224

క. పాండునృపసుతులలోన నొ, క్కండైనను నెవ్వఁ డింతకును ముదు వనితా
సంఘంబిచేరువ నెలఁగెడు, గడను నెఱసెదరు కురుని గాయము[2]నడునగన్. 225

వ. వైనంబు బలవంతం బనిన విని సంజయుం డజ్జననాథునితో దేవా వినుము వగచినం గృతపడినకార్యంబు గ్రమ్మఱం బొడమునే ఉండదము గురుగు నతియకాక యట్లుం గాక నీవు సేసినయగియ చూచె ఫలించె భంగసంబు వల దని యెన్నిభంగులం జెప్పినం బొసపులకుం గీడు దలంచి యప్పలుకులు గొన వైతివి వారలవలన వచ్చ నేకపాపంబు లాచరించితి నీవలన జనక్షయంబు వాటిల్లెం గాన నం గడవంబడిన దానికి వగవం బనిలేదు దారుణం బైనరణంబు విను మనుటయు నతండు కర్ణుం డట్లు వడసినకారణంబుఁ దొడంగి యెఱింగింపు మనుటయు నస్థాన వేళ్వాగసకు నాసూతసూనుం డి ట్లనియె. 226

క. కేపకడ సకలబలములు, భూపాలురు వెడలి నడవఁ గొఱికిఁ బిదపన్
నీపుత్త్రుఁడు వెడలెను సా, టోపతఁ దమ్ములును గర్ణుఁడును దో నడవన్. 227

వ. అయ్యవసరంబున. 228

సీ. రథము రథమ్ముఁ జేరఁగఁ దెచ్చి యమ్మేది, నీశ్వరుతోఁ గర్ణుఁ డిట్టు లనియె

1. క. గనమి మనసు. 2. క, నెదురక్; ఖ. మునుముక్.

నాకుఁ గృత్యంబు లనేకముల్ గలిగె ము, న్నా ధనంజయునకు నట్లు కాన
యీరసంబున మాకు నిద్దఱ కొండొరు, విడువక పెనఁగఁ జొప్పడద యింకఁ
[1]గలహ మెక్కుమొగంబుగావున నేఁ డేము, దలపడి పోరుదు మలవుఁ జలము
ఆ. నుల్లసిల్ల నొక్క రొకరుని నొంపను, జంపఁ జూతు మానికలింపనాథు
వలనఁ గన్న శక్తి వాలియుట నామీఁద, నలుకు లేక తెలియుము నాతఁ డధిప. 229
వ. అప్పుడు చేనెత్తురు గా కుండ నక్కిరీటి గీ టడంగించువిధం బూహింపుము. 230
చ. సరి యగు నాకు దివ్యశరజాలములం దలపోసి చూడ న
న్నరుఁడు దృఢత్వలాఘవగుణంబులఁ దక్కిన దూరపాతవి
స్ఫురణఁ గరంబు [2]వట్రపడు భూవర సౌష్ఠవరేఖ నేమియున్
దొరయఁడు ధైర్యశౌర్యపటుదోర్విభవంబుల హీనుఁ డెంతయున్. 231
క. మును విశ్వకర్మ దేవేం, ద్రునకై నిర్మించె సుహితరూపము విజయం
బనుచాపము దానను బహు, దనుజుల మర్దించె నతఁ డుదగ్రస్ఫూర్తిన్. 232
చ. పరిచయసక్తచిత్తుఁ డయి భార్గవరామున కాతఁ డిచ్చి సం
బరుషపరాక్రమమ్మున నృపాలుర నెల్లను నిమ్మహాభుజుం
డిరువదియొక్కమాఱు సమయించెఁ దదీయనితాంతశక్తి స
ప్పురమదయాపరుం డొసఁగెఁ బార్థివ నాకది కూర్మిఁ బెంపునన్. 233
ఉ. ఆనుహనీయచాపమున నర్జునుదర్ప మడంచి నేఁడు సం
గ్రామము నుజ్జగించెద సకంటకసుస్థితి గల్గ మేటి నై
భూమి [3]యెయమర్చెదం గొనుము భూవర నీ దగుపుత్రపౌత్రులన్
శ్రీమహిమన్ సమస్తజనసేవ్యమహోన్నతిఁ బొందునట్లుగన్. 234
వ. అని పలికి వెండియు నిట్లను నావిజయంబును విజయుగాండీవంబును నొక్క
రూప యతనికి నక్షయతూణీరంబులు నగ్నిదేవుం డిచ్చినయభేద్యరక్షంబును నవధ్య
రథ్యంబులుం గల వవి యెక్కుడయినను దాని కంతఁ జింతింప. 235
క. నారాచము లాదిగఁ గల, ఘోరప్రదరములు బండ్లఁ గొని వచ్చెద బల్
తేరులు దృఢవాజులు నా, తేరివెనుకఁ బెక్కు మచ్చి తెచ్చెద నధిపా. 236
వ. మఱియు నొక్కం డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయినకృష్ణుండు సారథ్యంబు
సేయుట నప్పార్థుపరాక్రమం బసాధ్యం బై యుండు నట్లగుటం జేసి. 237
తే. భండనము నేర్పు మెయిఁ గృష్ణుపాటి యనఁగ, మహిఁ బొగడ్తకు నెక్కనసమద్రనాథు
నాకు సారథి గాఁగ నొనర్పవలయు, గెలుతు నట్లైన నన్నరు నలవు మెఱయ.
క. హరి కెక్కుడరయ మద్రే, శ్వరుఁ డశ్వజ్ఞానమున నసంశయ మే న
న్నరునకు మిక్కిలి బలవి, స్ఫురణంబునఁ గర్ణ కుశలబుద్ధిఁ దలంపన్. 239
క. కావున నవ్వీర మిమ్మాటు, గావించుట యెల్ల హితమ్ము గావించినయ

1. చ. గలమెన మొగియదు గావున. 2. జ. దొట్రుపడు. 3. జ. యొనర్చెదం.

ట్టి వెలయు నింత సేసిన, హీనరథుఁ జూడు పోర నె ట్లేచెదనో. 240

క. విను మిత్త్రేఱుఁగున నే న,య్యనిమిషవర్గంబు నైన నాజి జయింతున్
మనుజులు పాండుతనూజులు, జననాయక నాకు నొక్క కేసరకే తలఁపన్. 241

వ. అనిన విని నీపుత్త్రుండు ప్రీతుండయి రాధేయు సగ్గించి నీకెల్లభంగిని శల్యు సారథిం గావించెద నని పలికి యుత్సాహదీప్తుం డై. 242

క. అమ్ములబంట్లును రథర,థ్యమ్ములునుం బెక్కు దెత్తు నవనీశులు నా
తమ్ములు నేనును నీపా, ర్శ్వమ్మున నడచెదము [1]బరవసం బుగ్రముగన్. 243

క. అని చెప్పి ప్రీతుఁ డగునా, తనిఁ దోడ్కొని నడచి సముచితంబుగ శల్యుం
గని భక్తిఁ బ్రణతుఁ డై యి, ట్లను దుర్యోధనుఁడు సవినయముగ నతనితోన్.

దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యంబు సేయు మని ప్రార్థించుట.

సీ. సత్యవ్రతంబును శాంతనవుని శౌ,పాదనంబును మహాభాగతయును
నీకు నైజంబులు నాకుఁ బెద్దయుఁ గూర్తు, గావున నిన్నను గౌరవించి
వినుతుండ వై వేఁడికొని యెద రాజుల, నడుమ నీ దగుసామర్థ్య మెఱిఁగి
యజ్ఞును నీని దెగటార్పఁగ నలయుట, యూహించి సంభృతోత్సాహలీలఁ

ఆ. గావు మితని నునుఁ గర్ణునిఁ జూపి యీ, తని రథంబు గడపు మనఘ యిట్టు
లైన నితఁడు పగఱఁ బోనీక పోదివి య, స్ఖలితగతుల నొంపఁ జంపఁ జాలు.

చ. గురుఁడును భీష్ముఁడుం జనిరి కొంచెపుమూఁకలతోడ నేను సం
గరవిజయంబు గోరి భుజగర్వమునన్ సడిసన్న పాండుభూ
వరసుతవర్గము న్ దొడగువాఁడను గా మది నిశ్చయించు టె
వ్వరిఁ గొని యింత నివ్వెఱఁగినా నినుఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్. 246

క. ఇమ్మివ్వర[2]మ్ము సార,థ్యమ్మితనికిఁ జేయు మినుని కనుఁగుఁడు సాహా
య్యమ్మొనరిచినట్టుగఁ దిమ్మ,రిపుమ్మకిరియన్ రూపు సెడి యరాతు లడంగన్. 247

క. అనిన విని కెంపుసొంపునఁ, గనుఁగవ యుగ్రముగ బొమలు గదియఁగ ఫాల
మ్మునఁ జెమట వొడమ నీసుతుఁ, గనుఁగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్.

సీ. నను నింతనీచపుఁబనికిఁ బంపఁగ నీకుఁ, దగునె భూవర వర్ణధర్మవిధము
లెఱుఁగవే శూద్రుల కేనాఁటఁ బరిచర్య, సేసిరి మూర్ధాభిషిక్తు లైన
రాజులు సూతజు రాధేయు దొరఁ జేసి,కొని యేను సారథ్యమునకుఁ జొరఁగఁ
జాల నీతని బలశాలిగాఁ దలఁచెదు, [3]నాకంటె నిట్టిబన్నంబుఁ గలదె

ఆ. పగఱలోన నొకనిఁ బొల్పెట్టు మెట్టివాఁ, డైన సమయఁ జూచి యరుగువాఁడ
నట్టిభంగి సాల దంటనిఁ [4]దరవాయి, గొని వధింతు శత్త్రుకోటి నెల్ల. 249

---

1. క. బరవసము దగ్రముగన్. 2. గ. మితనికి సహాయమ్ముగ నినునకు నసూయు సారథ్యసహా, య మొదవి-జ. మ్ము సార, థ్యమ్మితనికిఁ జేయు వినతాతనయుసహాయ,త్వ మొదవినరవిగతి. 3. క. నాకింతకంటె బన్నంబు. 4. క. దరువాయి-గ. అరవాయి.

క. విను మేను విక్రమింపఁగఁ, గనుఁగొనియెడు నంతవాఁడు గలఁడే కులశై
లనికాయంబు పగుల్తుఁ, వననిధులు గిలంతు ధరణి వ్రత్తుం గలయన్. 250

చ. సరవర చూడవే తెలియ నా దగుబాహువు లుద్బలంబు నీ
వరయక పల్కితే నొకని కక్కట సారథి నై రథిత్వవి
స్ఫురణము దక్క నోపుదునె సూతతనూజుఁడు షోడశాంశము౯
దొరయఁడు నాకు వాసవసుతు౯ మురమర్దనుఁ జీరికిం గొనన్. 251

వ. ఇట్లుగు లెలుఁగక చెప్పితి వెఱంగియుఁ గర్ణపక్షపాతంబున నవమానించెదేని మా భూమికిం బోయి వచ్చెద నని పలికి రాజమధ్యంబున నుండి వెడలి పోవం జూచినం గురుపతి సప్రణయబహుమానంబునం జని నిలువరించి సాంత్వనస్వరంబున మధురాక్షరవిన్యాసంబుగా నతనితోఁ [1]కర్ణుండ యేల తక్కు నీ కెక్కుడు యురథికులు గలరే కడిందిపగఱకు హృదయశల్యం బగుటఁ గాదె నీకు శల్యుం డనునభిధానం బయ్యె నాయభిప్రాయంబు వినుము ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు మిక్కిలి కృష్ణునకు నశ్వహృదయజ్ఞానంబున నీ వధికుండవు ధనంజయునకుఁ బ్రతివీరుంగా మనము కర్ణుం జాలించితి మని కృష్ణుండు నెల్ల నీ కునికిం జేసి కృష్ణుప్రయత్నంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుం గోరితి నింతపని నీకుం దక్క నొరులకు శక్యం బగునే యనిన విని ముదితహృదయుం డయి మద్రేశ్వరుండు. 252

క. ననుఁ గృష్ణుకంటె నధికుం, డని యిమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం
గొనియాడితి విమలయశో, ఘనుఁ డగుకర్ణునకు రథము గడపెద నధిపా. 253

వ. అని యాసూతనందను నుద్దేశించి వెండియు నిట్లనియె. 254

క. జనవల్లభ యొకసమయము, విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు, నను నెగ్గులు పట్టకుండితేనిం బొం దొనరున్. 255

క. అనుటయు గౌరవమున నీతనయుఁడు రాధేయుఁ జూచి తగు నిట్లుగఁ గా
కని పలికి శల్యునిం గనుఁ, గొని యిది గడు లెస్స యనియెఁ గురువంశనిధీ. 256

వ. ఇట్లభినందించి యున్నయన్నరేంద్రుం డమ్మద్రపతిమనం బురియాడునో యని శంకించి యతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు తొల్లింటిపెద్దలవృత్తాంతంబు వినుము మార్కండేయమహాముని మాతండ్రి కేను వినుచుండఁ జెప్పినయది నీకుం జెప్పెద సురలతోడిసమరంబున నసురవరుం డగుతారకుండు దెగినపిదపఁ దదీయతనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును గమలాక్షుండును ననువారలు వారిజాసను నుద్దేశించి. 257

దుర్యోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసురులవృత్తాంతంబు సెప్పుట.

క. దమమున నియమంబున ను, త్తమమును ఘోరంబు నైనతపమున మతినిష్ఠం
బ్రముదితులై చేయఁగ న, క్కమలభవుఁడు దోఁచి పరమకారుణ్యమునన్. 258

1. క. గర్ణుండ యేల తక్కు నీకెక్కుడురథికులుం.

వ. వరంబులు గోరికొం డనవుడు వా రందఱు నొక్కమాటయ కా సకలభూతంబుల వలనను సర్వకాలంబులయందును నవధ్యత్వంబు మాకు నీ వలయు నని యడుగు టయు నయ్యజుండు. 259

క. ఆచంద్ర మెందుఁ గల దది, గోచరమే [1]యిచ్చుటకును గొనుటకుఁ దగుపై
సూచి యడుగుండు [2]శుభదం, బై చెల్లెడునట్లుగాఁ బ్రియంబున నిత్తున్. 260

వ. అనవుడు నయ్యసురు లట్లేని మాకు ముప్పురంబు లెల్ల సుఖంబులుం గలిగి కామగమనంబు లై దేవదానవయక్షరాక్షసజాతులకుం జెఱుపరాక విల సిల్లునట్లుగా నొసంగు మేము భవత్ప్రసాదంబునం బుర నిర్భయుల మై పెంపొంది సంచరించెద మనుటయుఁ బద్మభవుం డది లెస్స దీనికం గూఁ యిట్టిది యొకని నుడివి యట్టిది గాకుండ ప్రపన్నత్తుల రై వర్తిలుం డనిన యద్దనుజేంద్రు లప్పురంబు లప్పు డొక్కఁడిం గూడిన నప్పుడు బలియుం డగువాఁడు నెఱుకం దలంచినం జెడునట్లుగా నొడంబడితిమి త్రిపురంబులు నగరంబులు గా నున్న నసాధ్యంబు లై వలయు వలయు నని పల్కిన నద్దేవుండు మూఁడు పురత్రయంబును సంపాదించుకొనుం డే నమ్మహానుభావంబులం గొనునట్లుగా నిచ్చితి నని నిజస్థానంబునకుం జనియె నిట్లెఱుంగున. 261

తే. వరము వడసినయాదైత్యవరులు దనకుఁ
బురము లొనరింప దానవపూజ్యు మయుని
వేఁడికొనుటయు నాతఁడు విపులతపము
కలిమి నొప్పారుపురవరమ్ములు ఘటించె. 262

వ. అవియుం బ్రాకారగోపురప్రాసాదప్రముఖవివిధావయవంబులు పసిండియు వెండియు నినుమును నై నాల్గుదిక్కులు నూఱేసియోజనంబులు గలిగి యుండు నందుఁ బసిండిం జేసినయది దివంబునను వెండి నొనరించినయది యంతరిక్షంబునను నినుమునం గావించినయది భూమిని సంచరించును వానిని వానికిం దారకాక్షుండును గమలాక్షుండును విద్యున్మాలియు రాజు లయి దివ్యంబు లగునంబరంబులను నాభరణంబులను మాల్యానులేపనంబులను మఱియు ననేకవిభవంబుల నుజ్జ్వలు లై [3]నెగడుదు రిట్లు పురత్రయవిహారంబున జగత్త్రయంబును నాక్రమించి యసురత్రయం బప్రతిహతవిభూతిమై వర్తించు నమ్ముప్పురం దన్ను నాశ్రయించుటం జేసి వారల యోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యె నెల్లం దన మాయాబలంబున మయుం డొదవించుచుండు నవ్విధంబున బరమసౌఖ్యంబు లనుభవించుచుండ బహుకోటిసంవత్సరంబులు సనియె నట్టియెడ. 263

1. చ. నిచ్చువరము గొనుఁడు దగవుపై. 2. జ. సుఖదం బై. 3. జ. నెగడి రట్లు.

సీ. తారకాక్షున కొక్కరేతయుండు హరి యన, జనియించి వారిజాసనుగుఱించి
తపము సేయంగఁ బ్రత్యక్షమై యద్దేవుఁ, డడుగుము వర మన్న నతఁడు త్రిపుర
ములవారి లాయుధంబులు దాఁకి చచ్చినఁ, బినుఁగుల్ నీరిలోఁ బెట్టి తడుప
నొక్కఁడు పదుగు రై యెక్కుడులాగును, బీరంబు మెఱయ సంప్రీతి నల్ల

ఆ. సిల్లునట్టిబావి చిరతరతోయ మై, మాపురములఁ జిత్రమహిమ వెలయ
నానహిల్ల వలయు ననిన నిచ్చితి నని, యమ్మహాత్ముఁ డరిగె నదియుఁ గలిగె. 264

వ. ఇట్లు మహాప్రభావం బైన [1]యబ్బావి పడసి యప్పురంబులవారు పోరికి శంకింపక నిర్జరభయంకరు లగుచు భువనంబు లన్నియు బాధించుచుం బెరిగి లోభమోహవశతం బొంది విచ్చలవిడిం దిరుగం దొడంగిన దేవపితృమునిజనస్థానంబులకు హాని పుట్టినం బురందరుం డఖిలబృందారకులుఁ బరివేష్టింప నప్పురంబులపై నెత్తి చని పెనంగి భేదింపం జాలక విషణ్ణుం డయ్యె నంత నతండు దివిజులుం దాను సంయమిసహితుం డై చతురాననుపాలికిం బోయి ప్రణామపూర్వకంబుగా నద్దానవుల తెఱం గెఱింగించి తద్వధోపాయం బడిగిన నతండు వారల కి ట్లనియె. 265

ఉ. ఏచినయాపురత్రయము నేకశరంబున రూపు మాపఁగాఁ
జూచినఁ బోవుఁ గాని వెఱఁజొప్పునఁ బోవదు సంగరోన్ముఖుం
డై చనుదెంచె నేని మదనాంతకుచే నది సెల్లు నొండ్లకు
న్గోచరమెట్టు లింతలు పనుల్ సనుఁ డమ్మహితాత్ముపాలికిన్. 266

ఆ. అనిన నట్లు కాక యని దివ్యవర్షసహస్రకంబు వార లధికనిష్ఠ
నతులతపము సేసి యత్యంతశుద్ధాత్ము, లై మహేశుకడకు నరుగునపుడు. 267

వ. అవ్విరించిం బ్రార్థించి పురస్సరుం జేసికొని యరిగి. 268

క. వరద శరణ్య శశాంక, స్ఫురితశిరోభాగ సర్వభూతేశ్వర శం
కర సాంఖ్యయోగనిష్ఠా, పరసులభ సనంగదమనుఁ బరమాత్మ శివా. 269

త్రిపురసంహారముకొఱకు బ్రహ్మాదులు రుద్రునిం బ్రార్థించుట.

వ. కని ఫాలంబులు భూమి సోఁకం బ్రణమిల్లిన నద్దేవుండు మీరాకకుం గారణం బేమి యనవుడు లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి. 270

క. స్తుత్యానుభావ నిర్మల, నిత్యానందస్వరూప నిగమవిరోధి
స్థిత్యపనయనోన్ముఖ చి, త్సత్యాత్మక భక్తలోకదౌర్గత్యహరా. 271

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించినం బ్రసన్నుం డై భవుం డాదరించి మీకు భయంబు వలవదు మీ చెప్పినయట్ల చేసెద వలయుకార్యం బెయ్యది యనిన దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొంది నరవిందభవుం డప్పరమేశ్వరున కిట్లనియె.

క. 1 యవ్వరంబు వడసి 2. క. మెట్టు లింతలు పనుల్ సనుఁ డమ్మ; మెట్లగుం జనుఁడు • గొబ్బున నమ్మ.

సీ. ప్రజలకుఁ బతి గాఁగఁ బనిచితి నీవ, యన్నట్లు పదస్థుండ నగుటఁ జేసి
విచ్చలవిడి వరం బిచ్చితి నసురత్రయమునకు దుర్గత్రయంబు గలిగి
యమ్మువ్వురును దారుణాక్రమమున భువన, [1]త్రయసంబాధనం బొనర్చు
చున్నారు వారల నెవరులకు నుడుప శక్యము గాదు నీవ శీఘ్రంబ చెఱుప

ఆ. వలయు మునులు దేవతలు నేను శరణుచొచ్చితిమి నిన్నుఁ గరుణఁ జేకొనంగ
వలదె మమ్ము నొగులఁ గలరె జగంబులు, గావ భూతినాథ నీవు దక్క. 273

వ. అనవుడు పద్మభవుం డయ్యసురులు సెఱుప వలయువా రగుదురు వారలు బలవంతులు తే
నొంటిమై నాపనికి నుత్సహింప నేర మదీయంబు లగు తేజోబలంబులం దర్ధంబు
పుచ్చుకొని మీ రందఱుం గూడి యాదుష్టదైత్యుల మర్దించుట కార్యం బనిన నద్దే
విజులు మా కందఱకుం గల తేజోబలంబులకు నద్దనుజుల తేజోబలంబులు రెట్టియగు
యుండుట నగ్గలం బగుటం జేసి మాచేత నెడగు భవదీయ తేజోబలంబులు భరియింప
మేము శక్తులము గాము మాయందఱ తేజోబలంబులలో సగంబు పుచ్చుకొని నీవ
యాశత్రుల సమయింపు మల్ల భంగిని నీకు రక్షణీయుల మగుమమ్ము రక్షింపు మను
టయు నజ్జగన్నాథుండు. 274

క. అసురులకు సురులకు నే, సముఁడ శివం బఖిలభూతజాలంబులకున్
సమత నొసంగెద శివనా, మము నాకుం జెల్లు లోకసామ్యం బగుచున్. 275

వ. అయినను. 276

చ. అనయముఁ గ్రూరకర్ము లగునట్టివిమూఢులఁ బెల్కుమాన్పఁ బా
వన మొగి ధర్మసమ్మతము లోకుల కీయెడ ద్రోహ మయ్యెడి
దనుజులఁ ద్రుంచి మీకుఁ బ్రమదం బొనరించెదఁ దేజముం బలం
బును సగపాలు వెట్టి ననుఁ బొందఁగఁ జేయుఁడు మీర లందఱున్. 277

వ. అని మఱియు నొక్కటి సెప్పెద లోకంబుల కెల్లను బశుత్వంబును నాకుం బశుపతి
త్వంబునుం గా వలయు నట్లయినఁ బశుపాశంబునం బాపింపఁబడుట లే కుండు. 278

క. ఒనరింపుఁడు నిర్వ్యాజం, బున దచ్ఛేదకుని సర్వలోకముల విల్లును ము
మ్మును నాకు నట్లు లైనను, దనుజులగర్వములు వినిహతము లగు నాచేన్. 279

ఆ. అనిన విని పశుత్వమునకు శంకించి వి, ష్ణుం డైన సురల కందఱు మొగిఁగి
భయముఁ గొనఁగ వలదు పశుభావమోక్షణ,విధియుఁ గలదు దాని వినుఁడు మీరు.

వ. అని పలికి హరుండు వారలతోఁ బాశుపతవ్రతానుష్ఠానంబునం బశుత్వమోక్షణం
బగు నదియును ద్వాదశాబ్దంబులు నడప వలయు నిష్ఠానురూపంబుగా సంవత్సరం
బుఁ దదర్ధంబున ఋతుత్రయ మాసంబునుఁ బండ్రెండుదినంబుల మాత్రను ఫలించు
ననుటయు నట్ల కాక యని వార లందఱును లోకంబులకు లోకేశ్వరునకుఁ బశు

1. క. త్రయంబును బాధ నలంచుచున్న, వారల నుడుప నెవ్వారికి శక్యంబు, కాదు గాదు శీఘ్రంబ
• చెఱుప నిపుడ.

త్వంబుఁ బశుపతిత్వంబుఁ గలుగుటకు నొడంబడి యమ్మహాత్మునిఁ బశుపతి యని పేర్కొని నిజతేజోబలార్ధంబులు సమర్పించినం గైకొని యత్యధికబలుం డై తొల్లింటికంటె వెలింగ నప్పు డద్దేవునకు దేవతలు విభవం బెసఁగఁ బురహననంబునకయి యభిషేకంబుసేసి త్వష్టు నాలోకించి మహాదేవునకు దివ్యరథంబును దగియెడుసాధనంబులను గల్పింపు మనవుడుఁ దపఃప్రభావమహనీయుం డగువిశ్వకర్మ యవహితుండై.

సీ. సామర్థ్య మొప్ప విశ్వంభరాచక్రంబు, రథము గాఁ జేసి చంద్రుని నుష్ణ
కిరుని జక్రంబులుగాఁ బెట్టి వారిధి, నదు లొనర్చి హిమవానీధ
రంబున వింధ్యనగంబున నక్షాచ, లంబున నుదయశైలము [1]బలుపు
టనయనంబులు దీర్చి యగ్నుల మూఁటఁ ద్రి, వేణుకరచనఁ గావించి మేరు

ఆ. పర్వతము నాతపత్రంబుఁ గల్పించి, హరులు వేదములు శరాసనంబు
వత్సరంబు శరము [2]వాసుదేవుండును, గాఁగ సంఘటించె గౌరవమున. 282

వ. ఇట్లు చరాచరాత్మకం బై తేజరిల్లుచున్న తేరు వీక్షించి ఫాలాక్షుండు గ్రహమండిత వ్యోమమండలం బుపాదానకారణంబుగా విశ్వకర్మ గావించినకవచంబు దొడిగి శరాసనంబు [3]ధరియించి శరంబు పుచ్చికొని దానవసంత్రాసనోత్సాహుం డగుచు నారోహణంబు సేసి వృషభధ్వజంబునం బోలు పొంది. 283

ఆ. అప్సరోగణంబు లాడుచుఁ బాడుచు, సంతసమునఁ జెలఁగ సకలమునులు
బహువిధములఁ దన్నుఁ బ్రస్తుతి సేయంగ, సమరవసుధఁ జూచి యల్ల నగుచు.

క. సారథి యెవ్వం డనుటయు, వారలు చిత్తమునకు వచ్చినవానిన్
గారుణ్యంబునఁ గైకొని, తేరు నడుపఁ బనుపు మనిరి నిరవిచారా. 285

వ. అనవుడు నద్దేవుండు. 286

తే. అరయ నెవ్వాఁడు నాకంటె నధికుఁ డట్టి
వీర యెఱిఁగి యొనర్పుఁడు సారథ్య
మునకు నని చెప్పుటయు మహామునులుఁ గూర్చి
కొని యమర్త్యులు సంభృతావేశయుతు లగుచు. 287

వ. కమలాసనుకడకుం జని భక్తిం బ్రణమిల్లి దేవా నీవలన నీలగ్రీవుండు ప్రసన్నుం డయ్యె భవదాజ్ఞ నీతనికి రథంబుం దగుసాధనంబులు సమకట్టితిమి సారథి దొరక కున్నవాఁ డది యెట్లనిన సారథ్యం బాచరించుపురుషుండు బలసత్త్వంబుల రథికున కధికుండు గావలసి యుండు రథంబు పృథ్వి రథ్యంబులు వేదంబులు రథికుండు రుద్రుండు రథచోదకుండు సులభుం డగునే గుణాధికుండ వగునీ విప్పనికిం బూనవలయు దానవభయభ్రాంతుల మైనమమ్ము రక్షింపుము మా కేడుగడయు నీవ

1. అ. నవయన, నంబులు దీర్చి • నగ్నిత్రయమునఁ ద్రి. 2 అ. వాయుసోమాగ్నులుఁ. 3. క. ధరియించి విష్ణుసోమాగ్నిసంభవం బై వెలుంగుశరంబు.

మద్రపతికి మఱియు ని ట్లనియె. 294

సీ. ఇది యొక్కయితిహాస మే నొద్ద నుండ ధ, ర్మప్రవీణుం డగు బ్రాహ్మణుండు
ధృతరాష్ట్రవసుమతీపతికిఁ జెప్పినయది, వినుము భార్గవవంశమునఁ బ్రసిద్ధుఁ
డగుజమదగ్నికి నత్యంతనిర్మల, మతి రాముఁ డుదయించె నతనిచేయు
తపమున హరుఁడు ప్రత్యక్షమై నిలిచిన, నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయును

ఆ. ససుహోత్రుఁ డశుచు లైనవారల నవి, నిర్దహించుఁ గాన నీవు పరమ
శుచివి గమ్ము నీకుఁ జొప్పడు నఖిలమ, హాస్త్రవీర్య మనియె నాదరమున. 295

వ. అనిన విని జామదగ్న్యుండు వినతుం డై నా కెప్పుడు పాత్రత్వంబు గలిగె[1]నప్పుడు నీవ తలంచి దయసేయుదువు గాక నిను శుశ్రూష సేయుచుండునట్లుగాఁ బ్రసాదింప వలయు నని విన్నవించిన విని కరుణాయత్తచిత్తుం డగుభవుం డవ్వరం బిచ్చిన నమ్మహాత్ముండు [2]నియమనిష్ఠాపరుం డై పూజోపహారప్రముఖవిధానంబుల నద్దేవు నారాధించుచుండ ననేకసంవత్సరంబులు సన నొక్కనాఁడు పరమేశ్వరుండు ప్రసాదలసితాననుం డై గౌరీదేవికి నతనిం జూపుచు. 296

క. రాముఁడు విమలవ్రతుఁడు, ధ్యానమహితుఁడు నాకు భక్తుఁ డని పలుమాఱుం
దా ముద్దు సేసి మృదువచ, నామృతసంసిక్తుఁ జేయు నాసమయమునన్. 297

వ. బలవంతు లగుదనుజులచేత బాధితు లయి బృందారకు లయ్యంధకరిపుపాలికి భయసంభ్రమంబులతో నరుగుదెంచి తమయలజడి యెఱింగించిన. 298

ఆ. జామదగ్న్యుఁ జూచి చయ్యనఁ జని దాన, వుల వధించి దేవతలకుఁ బ్రీతి
యాచరింపు మనియె హరుఁడు దానికి మని, ముదముఁ బొంది కేలు మొగిచి యతఁడు.

క. అకృతాస్త్రుఁడ నగునాకుం, బ్రకటభుజాబలులు నస్త్రపారీణులు నై
సకలసురనికరసంబాధకు లగుదానవుల గెలువఁ దరమే యనుడున్. 300

తే. అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ
దలఁపు నీ వెస నిలిపెద దానఁ జేసి
పగఱ నిర్జింప నగుఁ బదంపడి మనోర
థంబు సిద్ధించు నరుగుము తడయ కనఘ. 301

చ. అనవుడు నట్ల కాక యని యాజమదగ్నిసుతుండు ధీరతం
జని సముదగ్రు లైనసురశత్రులఁ దీవ్రత[3]రాయుధోత్కరం
బున వధియించి వారిబలుపోటుల నొచ్చినమేనితోడ వ
చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ గరంబున నంటి యాతనిన్. 302

వ. ఇవ్విధంబునం [4]బ్రకృతిస్థశరీరుం గావించి భర్గుం డాభార్గవుపయిం బ్రీతిశీతలం బగు నాలోకనం బొలయ నాతని కి ట్లనియె. 303

---

1. క. నప్పుడ నీతలంచినట్ల దయ సేసెదవు గాక. 2. గ. యమనియమానుష్ఠానపరత్వంబు గలిగి పూజో. 3. గ. రాశుగోత్కరం. 4. క. బ్రదీప్తశరీ.

క. అనివర్తనమతిఁ గవయఁగ, నని నీ డగుతనువు సునిశితాయుధములు [1]దాఁ
కిన నొవ్వదు శత్రులు ప, న్నిన నుడుపుము గర్వ మడఁచి నిర్మలచరితా. 304

వ. కావున వరప్రతిగ్రహంబునకు నిదియ సమయంబు. 305

క. కొను మని దివ్యం బగున, స్త్రనికాయము శస్త్రచయముఁ దగ్గయుదియ ని
చ్చిన నవి యాతఁడు సాష్టాం, గనమస్కారంబు సేసి కైకొనియె నృపా. 306

వ. తదనంతరంబ లోకగురుం డగునాహరునిచేత ననుజ్ఞాతుం డై యతండు నిజస్థానంబునకుం జనియె నయ్యితిహాసప్రకారం బిట్టిది యివ్విధంబున వివిధదుష్కరసత్కర్మానుష్ఠానఫలంబు లై వచ్చినసర్వదివ్యాస్త్రంబులు నారాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుం డై యొసంగె నట్టిమహాత్ములు హీనకులజాతుల నాదరింతురె యప్పుణ్యపురుషుండు గయికొనుటఁ గర్ణుం డుత్కృష్టయోనిజాతుం డని తలంచెద వదనవక్షోబాహుప్రముఖాంగకంబులు చూడ దేవకుమారుండుంబోలె నున్నవాఁడు ప్రకృతికాంత కుండలవజ్రకవచంబులతోడ నాదిత్యసన్నిభుం డగు కొడుకుం గాంచునే సింగంబు లేడి కెల్లు పుట్టు నితనికి సూతసంవర్ధితుం డైనవాఁడు దోసరె నింతియ కానోపు రుద్రశిష్యత్వంబున విశ్రుతుం డగుభార్గవరామునకుఁ బ్రియశిష్యుం డగు నంగరాజు ననంగదమనుం బరిగ్రహించినవిరించిభంగిఁ బరిగ్రహించి నీవు సారథ్యం బాచరింపు మఖిలగుణంబులను సారథి రథికున కధికుండు గావలయు ననునీతి నీవు ప్రసన్నుండ వగుటం జేసి నాకు సిద్ధించె ననుటయు. 307

తే. క్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మాననమునఁ దలిర్ప నృపకు
మార నీవు నాకొలఁది యిట్టిదియు నెఱుఁగు
దేని నిది లెస్స నీకోర్కి యేను దీర్తు. 308

వ. అని మఱియును. 309

శల్యుఁడు కర్ణునకు సారథ్యంబు సేయ నొడంబడుట.

క. వీనులకుం బలుకులు సేఁ, దైనను జెప్పుదు హితంబు లగుకార్యంబుల్
దానికి నోర్వఁగ వలయుం, గాని యలుక వలదు నీకుఁ గర్ణున కధిపా. 310

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లను మద్రపతితోడ, హరున కజుఁడు నగున కచ్యుతుండుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ, శాలి నాకు నిచ్చ సంగరమున. 311

వ. అనవుడు నట్ల కాక యని శల్యుండు వెండియు. 312

క. తగువార లొరులు దెగడుట, పొగడుట యగుపలుకులు పొంతఁ బోనగు హితకా
ర్యగతులు సెప్పఁగఁ [2]దెగ డగుఁ, బొగ డగు నెవు రోర్వ వలయు బుద్ధి గలిగినన్.

తే. శత్రుతే రైన నడపంగఁ జాలువాఁడ, [3]నుఱవు సెప్పుదు రథికు నేమఱఁగ [4]నీను

1. జ. దాఁకిన నొవ్వ కుండఁ జేసెద, విను మానుషకర్మ మడఁచి. ♦ విమలచరిత్రా. 2. క. దెగడఁగఁ, బొగడఁగ నెదు. 3. గ. నొఱవు; క. నొఱపు. 4. జ. నీక.

దైన్యంబు నొందిన సైన్యంబు గలంగె నంతకుఁ దెప్పిఱి యెప్పటిబరవసంబు శోభిల్లం
గర్ణుండు గడంగి డగ్గఱి. 216

చ. అనిలజుమీఁద నేయ నతఁ డాశరముల్ దునుమాడి సప్తకాం
డనిహతుఁ జేసె నాతని దృఢప్రదరంబులఁ గప్పె నాతఁడున్
వినుము సముజ్జ్వలప్రదరవిద్ధునిఁ గా నొనరించి యమ్మరు
త్తనయుఁడు పేర్చి యార్వ వసుధావర యారథికుం డుదగ్రుఁడై. 217

మ. పదిబాణంబుల నొంచి విల్లు దునుమం బ్రస్ఫీతదీప్త్యుజ్జ్వల
ద్గద వైచెం బవనాత్మజుం డది యొడ్డఁగ ఖండించె నవ్వీరుఁ డు
న్మదుఁడై పాండవుఁ డొండువిల్లు గొని నానాకంకపత్త్రంబులం
బొదువం గర్ణుఁడు నొంచెఁ దత్తను వతిస్ఫూర్జద్దశాస్త్రంబులన్. 218

వ. దానం గోపించి. 219

చ. పటుతరమైననారసముఁ బాండునృపాత్మజుఁ డుగ్రుఁడై యుర
స్తటమున బెట్టు గ్రువ్వ సుగతం బయి వీఁపున నుచ్చి పోవ ను
త్కటధరణీప్రకంపచలితం బగుశైలముఁ బోలి తాల్మి మి
క్కుటముగ రోషరంజితముఖుం డయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్. 220

చ. రయమునఁ బంచవింశతిశరంబులు మేన నిగిడ్చి భల్లసం
చయహతి విల్లు నక్కడఁచి సస్మితవక్త్రసహస్రపత్త్రల
క్ష్మి యతిశయిల్ల రథ్యములఁ జెండిన మారుతి యేచి విద్విష
ద్భయదగదారుచిస్ఫురితబాహువిలాసవిభాసమానుఁ డై. 221

వ. అరదంబు డిగ్గ నుఱికి కర్ణునిదెసం గవియం గురుపతి సేనం గలయేనుంగులం బవి
యేడింటిం బురికొల్పిన నవి దివాకరుఁ బొదుపు నంబుదంబులచందంబున నాజెట్టి
మగనిం గిట్టిన నతండు జోదులతోడం గూడ నగ్గజంబులం జదుపుటయు సౌబలుని
ఘోటకంబు లాటోపంబున మూఁడువే లొక్కట నురవడించిన వానిప్రాపున నర
దంబులుం గాలుబలంబులుం గవిసి కూడికొని పొదివిన మదం బొదవి యమ్మహాబల
నందనుండు దారుణరణవిహారంబున నొండొండ పేర్చినయబ్బలం బుజ్జ్వలానలం
బున వైచినచర్మంబుచాడ్పున ముడింగి యొదిఁగె నప్పు డాశకునియోధులు పంచ
శతరథికులు రభసంబున నడరిన వారల సూతాశ్వకేతుస్యందనసమేతంబుగా నఱి
ముఱి నుఱుమాడి యగ్గలిక మెఱసినం గని యగ్గాంధారరాజు వనుపం గడంగినయవన
దేశీయు లగునాశ్వికులం ద్రిసహస్రసంఖ్యుల నవ్వాడముడి పొడిసేయుచప్పుళ్లు
గార్చిచ్చు వెదురుటడవి నేర్చుతెఱంగునం దోఁచె నిట్లు గదపందుపు సేసి యొండు
రథం బెక్కి యక్కౌంతేయుండు భండనంబు సేయ రాధేయుండు పాండవేయాగ్ర

జుం దాఁకి తీవ్రప్రకాండంబులం గప్పి సారథి సమయించినఁ దేరు తురంగంబులు
దూలంగ నీడ్చికొని పాఱిన వెనుకొనుచయ్యంగపతిం గనుంగొని. 222

ఉ. భీముఁ డదల్చుచుం రథము భీమగతిం గవియింప నాతఁ డు
ద్దామత మాఱుకొన్న వివిధస్ఫురదస్త్రపరంపరాద్వయ
శ్రీ మొన లప్పు డచ్చెరువుఁ జెంది నుతించె మురాంతకానుజుం
డామరుదాత్మజుం గడచి యంగపతిం వెసఁ దాఁకెఁ దాఁకినన్. 223

క. ఆయిరువురనిబిడకనత్సాయకపటలములు నిగుడ సరి మధ్యాహ్న
చ్ఛాయత్వవిబాధ్యుఁ డయ్యెం, దోయజబాంధవుఁడు మింటఁ దోఁపక యుండెన్.

వ. వా రొండొరులశరపరంపర లడఁగించి రాసమయంబున. 225

చ. తనకరముల్ నిగిడ్చి [1]యుచితంపుమెయిం గొనియాడి యంతటం
దనియక లీలఁ జేరి సముదంబుగఁ బద్మినిఁ బొందె భాస్కరుం
డనుటకుఁ దావలం బయి జనాధిప చూడ శమంతపంచకం
బున విరిదమ్మితేనియలఁ బొల్పెసఁగెం బ్రతిబింబ మంతయున్. 226

వ. అప్పుడు కృప సౌబల కృతవర్మాశ్వత్థామలయుద్దామ[2]సాహాయ్యంబున సమధికోత్సాహుం డగునాసూతనందనుసంరంభంబునం గౌరవానీకంబు దర్పోద్రేకంబునం గడంగినం బాండవబలంబునుం బొంగె నివ్విధంబున నిరువాఁగును గలయం బెరసిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెసఁగునులివు తూర్యరవంబుల గెలువ నమ్మేదిని నెత్తురుం జొత్తిల్లి కెంజాయ రంజిల్లుపట్టుంబు ముసుంగు వెట్టినయంగనచందంబు నొందె మస్తకప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుటప్రభృతిభూషణంబులును నాతపత్రధ్వజచామరంబులుం దునిసి పడి భీమాభిరామంబులుగా గరిహయనరసమూహంబులు రక్తసిక్తంబు లైన నకాలబాలాతపలీల యావహిల్లం దక్కినసేనాంగంబుల మిగిలినమాతంగంబులు పెనంగినకనకలిప్తకాండంబు[3]లూఁడుకొనం దాఁకిన నెరగల్లు వోవుకొండల కైవడిం బొలుచునవియును నస్త్రశస్త్రపాతంబులం గ్రమ్మురుధిరమ్ముల గైరికనిర్ఝరంబులతోడి ధరాధరంబుల ననుకరించునవియును మెయిమఱువు లఱువులై నానానిశితశరంబులు నాటినం జేట్పలు దక్కి ఱెక్కలు దెగియున్నశైలంబులం బోలునవియును నగుచుండఁ జెలంగి చతురంగంబులును బెరయఁ బెనంగునుల్లాసంబున శోణితం బడంగ మట్టవిసి రేణువు లెగసినం జూడ్కులు నిగుడ కున్నను దఱియ నుఱికి నిజాభిధానంబులను జననీజనకనామంబుల బిరుదాంకంబులం దమ్మెఱింగించికొనుచు వీరులు పోరుచక్కటికిం జొచ్చి ప్రాపై [4]పేరువాడుతదీయబంధుమిత్త్రులం బొగడునమరులమెలుంగులు నింగి నిండం బెల్లు దొరఁగుకీలాలం

1. గ. యుచితంబుమెయిం. 2. జ. సహాయంబున. 3. చ. లూఁదికొనం. 4. జ. పేరువాడి.

బాహుశాలి నడంచినఁ గోలంది నిలువక యేఱు లయి పాఱ నుబ్బి భూతబేతాళక్రవ్యా
దంబు లోలి లోహితంబు ద్రావుచు నాదించి నృత్తంబులు సేయ నంబరంబున నట్ట
లాడ నెక్కసపాటొనర్పం జాలు నాసమయంబున మనంబు లెప్పటితమకంబున
ననిం దనివి సనమిం గవిసి కయ్యంబు సేయు సైనికోత్తములసింహనాదంబులు
దిక్కులం బిక్కటిల్ల నాకలని కెలన నట మున్న తన్నుఁ బొదివిన త్రిగర్త కోసల
నారాయణ గోపాలబలంబుల నబ్బలసూదనసూనుండు గాండీవారావం బాకసంబు
వగిలింప నొప్పించి. 227

చ. తఱిమి సుశర్మఁ దాఁకిన సకేతండుఁ దదంగముపైన్ దశాస్త్రముల్
వఱపి మురాసురాంతకుని బాహువునం బటుమార్గణత్రయం
బఱిముఱిఁ జొన్పి బల్విడఁ దొయమ్మున నుజ్జ్వలకేతుదండ మే
త్తెఱఁ జలియింప నేసిన నుదీర్ణతఁ దత్కపి యార్చె నార్చినన్. 228

సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునరథంబుపైఁ బడి యాఁగుట.

సీ. వెగడునఁ [1]జెయ్వోని వేగంబ తేఱి సంశప్తకు లర్జునుసాయకముల
కోహటింపక సముత్సాహంబు వదల కందఱు నొక్కపెట్ట తద్రథము వొదివి
హరులతోఁ గాఁడియుఁ హరికేలు నొగలును, [2]బలుగాఁడియును గండ్లఁ బట్టి మెలఁగ
మిడుక రాకుండ నమ్మేటివిల్కానిన్, నును నిగ్రహించుట గనుఁగొనంగ

తే. నద్భుతం బయ్యె నపుడు సేయార్చి శౌరి
లీలఁ గొందఱ మత్తశుండాలభంగి
మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచతూపు
గములఁ బార్థుండు పలువుర సమయఁ జేసె. 229

వ. అంతఁ గొంతయూరుపు వోయినం జెఱునవ్వు నవ్వి కవ్వడి కమలనాభున కిట్లనియె.

ఆ. తేరు గదలనీక వైరులు బలువిడిఁ, బొదివి పట్ట రాచపోల్లనైన
యేను దక్క నృపతిసూనుఁ డిట్లోరుఁడు సహించు నెట్లు విక్రమించుఁగాక. 231

క. అని పలికి చూడుమీ స, న్ననుచు భుజంగాస్త్ర మేయ సది యరులకు గ్ర
క్కునఁ బాదబంధ మొనరిం, చిన మున్చె నతండు వారి శితవిశిఖములన్. 232

వ. ఇవ్విధంబున. 233

ఆ. నాగపాశబంధనంబుల గుదివడి, వారు వివిధబాణదారితాంగు
లై రథంబు విడిచి రప్పుడాసంశప్త, కవ్రజంబు గని త్రిగర్తవిభుఁడు. 234

క. గరుడాస్త్రం బేసిన న, చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం జంచు
స్ఫురణము మెఱయఁగ వెస న, య్యురగాత్మకబంధ మూఁడె నుర్వీనాథా. 235

క. తనకడిమి బంధమోక్షము, గనినరథికకోటి గడఁగి గాండీవిపయి నే

---

1. క. జేడ్వడి. 2. జ. బలుబండి కండ్లను బట్టి తోలఁగ.

పునఁ దూపులు దొరఁగింపఁగ, ఘనభుజుఁడు సుశర్ముఁ జేసెఁ గనదస్త్రమునన్.

చ. అది [1]నరుఁడెంద మాడుటయు నాతఁడు మూర్ఛ మునింగి తేరిపైఁ
జదికిలఁ బడ్డ నుబ్బి యదె చచ్చె సుశర్మునియేటు దాఁకి బ
ల్లిదుఁ డగుపార్థుఁ డంచు మదకేలిలల నార్చిరి నీకుసైనికుల్
చదలను దిక్కులం బరఁగె శంఖముఖోద్భటతూర్యనాదముల్. 237

సీ. అంతఁ దెప్పిఱి విలయాంతకుకైవడిఁ, గవ్వడి యేచి మార్గణచయంబు
పెల్లడరించిన బీఱువోయె సుశర్ము, యాసేనమీఁద నైంద్రాస్త్ర మక్కి
రీటి నవ్వుచు నేయ నాటోపమున నది, వివిధశాణాకృతిఁ గవిసి నుఱుము
గావింపఁగాఁ బదివేవురు సంశప్త, కాగ్రేసరులు దెగటాఱి రప్పు

ఆ. దుక్కు దక్కి తలరి తక్కటియోధులు, చేష్టితంబు లెడలఁ జిత్రరూపు
లట్టు లైరి ధూమ మడఁగిన వెలుఁగొందు, ననలుచంద మయ్యె నన్నరుండు.

వ. హతశేషు లైనసంశప్తకులు చతుర్దశసహస్రయోధముఖ్యు లవ్విజయువిజయంబు సహింపక యొండొరులం బురికొల్పికొని బలంబులతోడం గడంగిన నతం డతిదారుణం బగురణంబు సేయఁ దక్కటిపాండవులదెసఁ బోరుకౌరవబలంబు దద్బలశౌర్యంబు లోర్వక భీతిం గలంగి పఱచినం గృతవర్మకృపగురుపుత్రకర్ణులు నులూకసౌబలసుయోధనులును దుశ్శాసనాదికుమారులును బరవసంబు సేసి యాసైన్యంబు దైన్యంబు వాయ విక్రమించి రట్టియెడఁ గృపుని యపరిమితశరజాలంబు పాంచాలపుంజంబుం బొదివినం గనలి శిఖండి యమ్మహీసురవరుని మార్కొనియె నయ్యిరువురసమరంబు రామరావణులరణంబుకరణి నొప్పె నట్లు పోరి పోరి శారద్వతుండు. 239

చ. హరులను సూతుఁ జంపిన నుదగ్రత నాద్రుపదాత్మజుండు వి
స్ఫురితకృపాణచర్మపరిశోభితుఁ డై యరదంబు డిగ్గి స
త్వరముగ నేఁగుదేర శరవాహిని పై నిగిడించె నాతఁ [2]డ
య్యరి వెఱఁ గందుచుఁ నిలుచునట్లుగ జోదులు పిచ్చలింపఁగన్. 240

వ. అ ట్లేచినకృపాచార్యుపై నురవడించిన ధృష్టద్యుమ్నుం గృతవర్మయు ధర్మతనయ ద్రౌపదేయుల నశ్వత్థామయుఁ గవలం గురుపతియును వృకోదరుం గర్ణుండును దలపడి నిలువరించి రగ్గాతముండు శిఖండిపలక పఱియలు సేసిన నతండు దెరలక కేవలకరవాలంబున విక్రమింపం గడంగిన నయ్యతిరథుండు. 241

క. వాలికతూపులు మేనం, గీలుకొలిపి నొంపఁ గని సుకేతుఁడు బాణ
జ్వాలలు నిగుడ నడరి యా, భీలత నాకృపునితోడఁ బెనఁగె నరేంద్రా. 242

తే. తనకు నెడ సొచ్చి యిట్టు లతండు పెనఁగ
ద్రుపదనందనుఁ డల్లన తొలఁగి పోయె

1. అ. నరుమేన నాటుటయు. 2. క డయ్యర.

నాసుకేతుండు కృపునిమై నాఁడె నిరువ
దాఱుశరములు పఱపి రయంబు మెఱయ. 243

వ. ధనువు దునిమి యొండుకోదండం బెత్తిన నదియును ఖండించి. 244

క. తోడన హయసూతుల [1]నోం, గూడఁగ నేయుటయు నతఁడు గనలుచు బలువిల్
గ్రీడయఁపోలం గొని మే, న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్. 245

కృపాచార్యుండు సుకేతుం డనుపాంచాలకుమారునిం జంపుట.

తే. అట్లు నెప్పింపఁ దూఁగాడునాసుకేతు
కంధరము మెఱుఁగారెడుకత్తివాతి
దొడ్డతూపున నేపునఁ ద్రుంచుటయును
శిరము ధర డొల్లెఁ గుండలస్ఫురణ మెఱయ. 246

వ. ఇట్లు సుకేతుండు నచ్చిన నతనిమూఁకలు విచ్చె ధృష్టద్యుమ్నుండుఁ గృతవర్మయుం బోరునెడ ధృష్టద్యుమ్నుండు కృతవర్మవక్షస్స్థలంబు విశిఖనవకంబున నొప్పించుటయు నప్పాంచాలవరు నతండు సూతకేతుహయస్యందనసమేతంబుగా నిబిడశరజాలంబునం బొదివిన నవ్వీరుండు బలాహకపిహితమూర్తి యగు మార్తాండు ననుకరించి తాను సైంధవవధదినంబునం బారావతవర్ణంబు లగురథ్యంబు లగ్గురునరుణాశ్వంబులఁ బెరయం బఱపినతెఱంగున. 247

తే. అలిగి నొగ నొగతోఁ దాఁక నతిరయమునఁ
దేరు వఱపి కృపాణప్రదీప్తపాణి
యగుచు గద పుచ్చుకొనియును నలుసు లేక
చలము డిగఁ ద్రావి కృతవర్మ యిలకు దాఁటె. 248

వ. అక్కుంభసంభవుచందంబు గాక వంచనం జై[?]యప్పురుసున నబ్బలుమగండు దొలంగిన నయ్యరదంబుమీఁదికి లంఘించి యాధృష్టద్యుమ్నుండు. 249

క. ఆరథికు నచటఁ గానక, సారథితల దునుముటయును సంతసమునఁ బాం
గారి [2]తనశబ్ద మిచ్చి మ, హారవమున నిక్క డిక్క డనియె నతండున్. 250

చ. విని కృతవర్మఁ గాంచి పటువిక్రమకేలి యొనర్ప నాత్మవా
హనమున కేఁగి యేచి ద్రుపదాత్మజుఁ డాతఁడు లోను గాఁగ న
మ్మొనఁ గలమేటిజోదులసమృద్ధతి యేత్తెఱ నివ్వారింప వి
ల్లొనెఁ బటుశౌర్యశోభితబలుం డగునయ్యనుముఖ్యుఁ డొక్కఁడున్. 251

వ. అట్టియెడ నొక్కరథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచి కొని యనికిం దొలంగం గొనిపోయెఁ బాంచాలోత్తముండును దనమునుము బలంబు గలంగం బరాక్రమించుచుండె. 252

సీ. ధర్మపుత్త్రుఁడు గురుతనయుతోఁ బెనఁగుచోఁ, బాసట నై శినిపౌత్త్రుఁ డడరె

1. క. మైఁ గాఁడఁగ. 2. క. ×. తలశబ్ద.

నాయిద్దఱును ద్రౌపదేయులు వెఱఁగందు, నట్లు వారలను సైన్యంబుఁ బొదివి
బహుళాంధకార మాపాదించి యమ్మేటి, విలుకానిసాయకవితతి నింగి
ఘనమయంబుగఁ బర్వ జననాథ వారల్గి, యొక్కొక్కరుం డనేకోగ్రబాణ

ఆ. నిహతుఁ జేయ నతఁడు ప్రహసితవదనుఁ డై, యొకని నొకని బహుసముజ్జ్వలాస్త్ర
విద్ధుఁ జేసి కడఁగి వివ్వచ్చుకొడుకుచా, పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి. 253

క. ధృతి నొండువిల్లు గొని యా, శ్రుతకీర్తి తదీయతనువు సొనిపెం బ్రదర
త్రితయంబుఁ గనలి యాతం, డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్. 254

క. ముంచుమహోద్ధతి యాలో, కించి తనదుచూడ్కి దట్టకెం పెసఁగం గో
పించి శరనికరములు గు, ప్పించుచు ధర్మజుఁడు గవిసె భీషణభంగిన్. 255

చ. కదిసిన నమ్మహాభుజుఁడు కార్ముకముం దునుమాడి మూఁడు బె
ట్టిదపుమెఱుంగుతూఁపులఁ బకటిష్ఠత సూపిన నాన్నృపాలుఁ డు
న్నదుఁ డయి మేటివింట బలుమార్గణముల్ వెస నేసె మూఁడు న
ర్వదియును నద్ధరామరునిపై శినివంశవరుండు దోడ్పడన్. 256

వ. ఇట్లు ప్రాపై కడంగి. 257

ఆ. అర్ధచంద్రబాణహతి గురుపుత్త్రుని, ధనువు శినివరుండు దునుముటయును
శక్తి వైచి యతఁడు సారథిఁ గూల్చి బల్, వింటఁ గురిసె బహుళవిశిఖవృష్టి. 258

క. సారథి లేమిని సాత్యకి, తేరిచ్చెఁ దురంగమములు దేరటు వాఱన్
భూరమణ ధర్మనందను, వారు వొదివి రంపగముల వడి గురుతనయున్. 259

క. భీమాస్త్రశిఖల నశ్వ, త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర
స్తోమాటవి నొక వ్రేల్మిడి, నామెయి జనవిస్మయావహం బయ్యె నృపా. 260

వ. అప్పుడు కురురాజు పాండవుల నాచార్యనందనుచేతం దెగినవారలంగాఁ దలంచె నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండకాండంబుల నవ్విప్రవరుం బీడితుం జేసి. 261

సీ. అలవును వెరవును గలవు కృతాస్త్రుండ, వని నిన్ను నెఱుఁగుదు నైన నెల్ల
సొంపు పార్షతునకుఁ జూప నోపినఁ దెల్ల, మగు నది యట్లుండె నరయ నీకు
నెయ్యంబు వాటించునేర్పు కృతజ్ఞత, యనునివి లేవు బ్రాహ్మణుఁడు దపము
దమమును గల్గుపార్తసమున నుండుఁ గా, కని సేయునే యెంత యడచిపడినఁ

ఆ. బడిలి గాని యడ్డపడలేవు కౌరవ, కులము నెల్లభంగి గెలుతు మేము
నీవ చూడ ననుడు నాపీరుఁ డేమియు, ననక నగుచుఁ బఱపె నంపవెల్లి. 262

వ. ఆవెల్లికి నోర్వలేక యాభూవిభుండు దొలంగె నట్లంతటిమానిసిఁ గెలిచినవాఁ డై నిలిచి నిజపార్శ్వంబులమూఁకలం గనుంగొని గురుపుత్త్రుండు క్రూరవిహారంబునకు నమరి మెఱసె మారుతితోడం బోరుకర్ణుండు దదనుచరంబు లగుకరూశచేది సృంజయపుంజంబులుం దన్నుం బొదివిన నబ్బలంబునకు బాహుబలంబు సూపు చుండ నతని విడిచి యాభీమసేనుండు కౌరవసేనపయిం గవిసి కనుపుగొ

ట్టి రాధేయవృకోదరులమునుములు ధనంజయునమునుముభంగిం బ్రజాక్షయం
బగు చుండె నీదుర్మంత్రంబున ననేకులకుం బొలియ వలసె నయ్యవసరంబున. 263

సీ. కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁ డన్నకులునంగంబున నవశరములు
సొనిపి యాసహదేవు కసకపుసిడము ద్రుంచిన వారి లిరువురు నెనిమిదింటఁ
బనితూపులను నొంపఁ బతి రెండువిండులుఁ, దునుమాడుటయు నన్యధనువు లెత్తి
యన్నయుఁ దమ్ముండుఁ [1]దన్నుఁ బెక్కమ్ములఁ, బొదివినఁ గనలి యాభూవిభుండు

తే. వారి దివ్యాస్త్రములఁ గప్పె ఘోరభంగి
గాంచి జను లక్కమారులు గాలవశతఁ
బొందుదుర కాఁ దలంప నప్పుడు గడంగి
యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతిరయమున. 264

వ. ఇట్లు పాండవసేనాపతి భూనాథుం దాఁకి యేసిన నతండు. 265

ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దాఁకి విరథునిఁ జేయుట.

ఆ. ఇరువదేనునిశితశరముల నొప్పించి, యలిగి యాతఁ డతనిఁ గంకముల
నలువదేనుతూపు లడరింప నలుకైన, క్రూరవీర్యుండు గార్ముకంబు. 266

మ. బలువిల్లుగ్రత నెత్తి యొక్కమొగి నప్పాంచాలనస్యుండు [2]దీ
ప్తులు గ్రమ్మం బఱియేనుమార్గణము లాభూమీశుపై నేసినం
గలయం బూచినకింశుకంబుచెలు వారగం బొందఁ దచ్చాపముం
బెలుచం ద్రుంచి యతండు ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్. 267

క. కాలాయసనారాచము, లోలి నుదుట నాటి యున్న నొప్పారం బాం
చాలవరుముఖము మధుకర,మాలికచేఁ బొలుచుతమ్మియాడ్కిం జూడన్. 268

సీ. కనలి యప్వీరుండు కార్ముకాంతరమునఁ, గ్రూరభల్లంబుల ఘోటకముల
సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును, దునుమాడఁగా భవత్పుత్త్రుఁ డేపు
గుండక శక్తి [2]నిగుడ్చఁగఁ ద్రుంచె నే, త్తెఱఁ గృపాణము గొన నుఱుము సేసె
గద యెత్తఁ బఱియలు గావించె నుబ్బర, త్నమయాహికేతువు నఱికి వైచె

తే. నిట్లు హయసూతకోదండహీను దళితరథుని విగతాతపత్త్రు నిర్భగ్నశక్తి
ఖడ్గముద్గరకేతు విఖండితాపిధానుఁ జేసె నప్పార్షతుం డానవేంద్ర. 269

తే. వికలసాధనుఁ డైనయవ్విభుని నతని
తమ్ముఁ డగుదండధారుండు తనదు తేరి
మీఁద నిడుకొని శత్రుసమీపభూమి
వాయఁ గొనిపోయెఁ జూచి రాధేయుఁ డపుడు. 270

క. శినివంశవరునితోడం, బెనఁగి పెనఁగి యతని విడిచి పెలుచ ద్రుపదసం
దనునిరథమునకు నెదురుగఁ, దనయరదము నడఁగ నిచ్చె ధరణీనాథా. 271

---

1. క. గ. చ. నెన్నఁ బెక్క. 2. 'నిగుడ్చిన' అనియే వ్రా. ప్ర.

వ. సాత్యకియును శరంబులు గురియుచుఁ దోన తవిలె నుభయసేనాపతు లగు నా
సూతనందనధృష్టద్యుమ్ను లట్లు దార్కొనిన నయ్యిరువాఁగునందు నొక్కరుం డైన
నోల మాసగొనక కడంగినం బోరు ఘోరం బయ్యె నట్టియెడఁ బాంచాలకుమా
రులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును జయ రోచమాన సింహ
సేనులును బలుదేరుల మొత్తంబులతోఁ దన్నుం గవిసినం గర్ణుం డయ్యెనమండ్రు
వీరుల నెనిమిదిభల్లంబులం దునిమి తత్సహచరుల బహుసహస్రరథికుల సమయిం
చినం జేదిరథికప్రవరులు జిష్ణు జిష్ణుకర్మ దేవాపి భద్రులును దండ చిత్ర చిత్రాయు
ధులును హరి సింహకేతు రోచమాన శలభులును సబలంబుగాఁ దలపడిన [1]నాపదు
నొక్కండ్ర నొక్కపెట్ట బెట్టిదంపుటంపజడిపాలు చేసి మఱియును బిరుదు లయి పయిం
బడినదొరలను వారిపరివారంబులను వసుధం గూల్చియు నలంచియుఁ గలంచియుం
గడిమి మెఱయుచు నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడ మని జనంబులు
వెక్కసపడ వివిధసమరవిహారంబు సలిపి వెండియు. 272

సీ. సింహంబుబారిఁ జొచ్చినగజంబులభంగిఁ, బులి కగ్గమైనజంకెలవిధమున
జ్వలనంబుఁ గిట్టినశలభంబులట్లుఁ బాం, చాలయోధులుఁ జేదిసైనికులును
దనుఁ దాఁకి పొలియ రాధాతనూభవుఁ డని, దనివోక ధర్మనందనునియున్న
చక్కటి కడర ధృష్టద్యుమ్నుఁడును ద్రౌపదీపుత్రులును సహదేవుఁడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ
గలమహీశులుఁ బొదివి రక్కట్టు నతఁడు
పెక్కుపాములు బొదివినఁ బెనఁగుగరుడు
సనువు దోఁపఁగఁ బోరాడె మనుజనాథ. 273

వ. ఆసమయంబున భీమసేనుబారిం బడినకౌరవసైన్యంబునం బ్రబలచతురంగంబు
లొక్కమొగిఁ బడలువడి రణాంగణంబు [2]ముసాసికొనియెం బెఱమూఁకలు వెఱఁ
గునం జెయ్వేది కరళ్లడంగినమున్నీటియట్లుండె గాండీవి సంశప్తకుల ననేకుల
మేటిమగలఁ గీటడంచి హతశేషం బగుబలంబు విచ్చుటయు వాసుదేవు నాలోకించి.

ఆ. అమరులకు నజయ్యు లగునష్టసంశప్త, కులు మదీయబాణఘోరభంగి
కోహటించి పాఱుచున్నారు భీముని, మునుము కౌరవులును మొనయలేరు.

క. కర్ణుం డొక్కరుఁడును సము, దీర్ణుం డై సిడము మెఱయఁ దిరిగి బలువిడిఁ
ఘూర్ణితము సేసె మనసై, న్యార్ణవమును మంథనగముసెనను వమరంగన్. 276

చ. అరదము వోవ నిమ్ము రయ మారఁగ నాతనిదిక్కు నావుడు

1. క. గ. చ. నాపదునొకళ్ల. 2. క. మునురుకొనియె; గ. ముసుంగువడియె.

స్దరహాసితంబుతో నలిననాభుఁడు భీమునిచేతఁ బోదు నీ
శరములవేఁడిఁ గౌరవులసంగరవాంఛ యడంపు మన్న న
న్నరుఁడును నియ్యకొన్నఁ గురునాథునియోధులు బెగ్గడిల్లఁగన్. 277

ఆ. అమ్మురారి ధవళహయములు మెఱయ స్రగ్విక్క సౌవర్ణముగఁ దేరు వోవ
నిచ్చుటయును జూచి విచ్చె నబ్బలము సింగంబుఁ గనిన లేడిగమియుఁ బోలె. 278

వ. అప్పుడు నీకొడుకు సంశప్తకులం బురికొల్పిన రెండువేలరథంబులును మున్నూ
ఱేనుంగులును జతుర్దశసహస్రతురంగంబులును లక్షద్వయపదాతులును నప్పార్థు
పయిం గవిసిన నతండు శింజినీటంకారంబునం బాణాసారంబున నింగి నించి పది
వేవు రుద్భటక్షత్రియులం బొలియించి యక్కాలునం గాంభోజబలంబు దోఁచిన నం
దుఱికి తదీయసైనికులకరంబులు శిరంబులు నఱికిన నది [1]మహావాతనిపాతవిటపం
బైనయారామంబుచందం బయ్యె నట్టియెడ. 279

క. అడరి సుదక్షిణుతమ్ముఁడు, గడునడి నేయుటయు నతనికరశాఖలు గ
వ్వడి యర్ధచంద్రశరముల, వెడందితూపున శిరంబు వ్రేల్మిడిఁ ద్రుంచెన్. 280

క. యవనశకసైన్యములు పైఁ, గవిసినఁ దద్రుధిరజలము గాలువలై పా
ఱె వెసం బఱపెను వివిధాస్త్రవితానము లక్కిరీటి ధరణీనాథా. 281

మ. కని సంశప్తకు లేచి యొక్కమొగి నాకౌంతేయుని జుట్టుము
ట్టిన సేనాంగచతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె నా
తనిబాణోత్కరవేగ ముత్కటమహోత్సంగ్రామజయాతిపా
టనముం జేసినభంగిఁ బత్రబలగాఢస్ఫూర్తి శోభిల్లఁగన్. 282

క. హరి వెరవున ధవళాశ్వ, స్ఫురణమున రథంబు మెఱయఁ బోలు పాఱెడున
న్నరుసత్వాద్భుతవిక్రమ, పరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్. 283

క. ననుబోఁటులమనములు దా, నన్నునఁ గరఁగె ననంగి నేల సురతతి కృష్ణా
ర్జునులం గని దుందుభుల, స్వనములతోఁ గురిసె విరులవాన వాఁగడుచున్. 284

వ. అయ్యవసరంబున నశరీరవాణి యయ్యిరువుర నుద్దేశించి యఖిలజనంబులు నాకర్ణింప
వీరు చంద్రార్కులం గడచినకాంతిదీప్తుల నుల్లసిల్లెదరు తొల్లి యేకరథస్థులైన
బ్రహ్మేశానులవిధంబున వెలింగెదరు గంటిరే వీరలు పరమమును లగు నారాయ
ణుండును నరుండును జుండ యనియె నిట్లు మహనీయాశ్చర్యంబులు గనియును విని
యును మాత్సర్యధుర్యుం డగునాచార్యనందనుం డరిగి యమ్మహాత్ముల మార్కొని
మార్గణోజ్జ్వలం బగుదక్షిణకరంబున నాఫల్గునుఁ బిలిచి హాసభాసితముఖుం డగు
చుఁ గుపితుం డగునతని కి ట్లనియె. 285

### అశ్వత్థామ యర్జునుం బేర్కొని మార్కొని సంగ్రామంబు సేయుట.

క. ననుఁ దగియెదునతిథిం గా, మనంబునఁ దలంచి నీవు మన్నించెదవే

1. క. మహాశనిపాతనిపాతవిటపం.

విని వచ్చెద నీపాలికి, ననఘా సంగ్రామ మొనఁగు మాతిథ్యము గన్. 286

ఆ. అనినఁ గృష్ణుఁ జూచి యర్జునుఁ డాచార్య, తనయు గెలువ కునికి దైన్య మిపుడు
సమయఁ జూడ వలయు సంశప్తకులను నీ, మనసు నచ్చు పనికిఁ బనుపు మనుడు.

ఉ. తేరు మురారి ద్రోణసుతు దిక్కునకుం జన నిచ్చి మేలుమేల్
పోరు ఋణంబు దీర్పు కురుభూపతికిన్ నరుబాహులీలకు
న్నైస్సరణ గల్గి నిల్వు మనినన్ విని యట్టులు గాక యంచు న
వ్వీరుఁడు షష్టిబాణముల వెన్నుని నేసె నుదగ్రుఁ డై వెసన్. 288

ఉ. అమ్ములు మూఁడు పార్థుతను వాఁడఁగ నేసినఁ ద్రుంచి వైచెఁ జా
ప మతఁ డమ్మహాద్విజుఁడు భారవహమ్ముగ నొండువిల్లు శీ
ఘ్రమ్మున నెత్తి చేతులను గాళ్లను మోమున [1]వింటికొమ్మునం
గ్రమ్మినభంగి గా శితశ[2]రప్రతతుల్ వడి నించెఁ బైపయిన్. 289

క. కడుఁ బెక్కువేలు దూపుల, వడిఁ గృష్ణార్జునుల సరథవాహంబుగ నొ
క్కఁడుమదముసఁ బొదివినఁ జె, య్యొడలి వెఱఁగుపడిరి వారలిద్దఱు నధిపా. 290

వ. ఇవ్విధంబున వివిధవిశిఖజాలంబులఁ గాలు సేయార్పరాకుండఁ గప్పి యార్చిన నప్పార్థుం డతనిచేతఁ దనవిక్రమం బపహృతం బయ్యె నని తలంపఁ దద్దైన్యంబున హాహాకారంబు లెసంగం జారణసిద్ధగణంబు లట్లు నిశ్చేష్టితు లైనయాలోకరక్షకుల నాలోకించి లోకంబులకు బ్రదుకు గలుగునో యని పలుక నప్పద్మనాభుండు గసలి యక్కవ్వడి నుద్దేశించి. 291

క. గురుసుతుఁడు నిన్ను మిగులుట, గర మాశ్చర్యంబు ముష్టి గాండీవము దాఁ
దిర మయి యుండదొ బాహుల, వెరవుబలుపు గుందెనో వివేకింపు మెదన్. 292

క. గురునికొడు కనుతలంపునఁ, బరుసఁదనంబునకుఁ జొరక భంగపడితో యు
ద్ధరతఁ గడుఁ జెడియె ననవుడు, [3]సరోషసంరంభుఁ డై విజయుఁ డాతనితోన్. 293

క. వెసఁ బెక్కమ్ములు మనపై, ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన సం
తస మందెడు నింతన యేఁ, గని మసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్. 294

మ. అని భల్లప్రకరంబులన్ గురుతనూజాస్త్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రము జిత్రస్ఫూర్తిఁ దున్మాడి గ్ర
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుక్కుం దాల్మియుం దోఁప నె
త్తినఁ దోడ్తో నవి ద్రుంచి వైచె సమరస్థేమాభిరామాకృతిన్. 295

ఆ. ఇట్లు ద్రోణసుతునియేపు పార్థుఁడు దుహీనంబుఁ జెఱచునినువిరోధంబు మెఱయఁ
జెఱచె నంతఁ బొదివె నుఱక యారథికు సం, శప్తకవ్రజంబు సరభసముగ. 296

క. ఎందఱు వొదివిరి వారల, కందఱకును దమక తమక యర్జునచటుల
స్యందన మెదు రైనట్లు మ, దిం దోఁచెఁ దదీయబాణతీవ్రబహుళతన్. 297

1. అ. వింటికొప్పునం. 2. అ. రమ్ములు వే నిగిడించె. 3. అ. సఘోషుఁడై క్రీడి యనియెఁ జక్రాయుధుతోన్.

క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పఁగ వజ్రోపమానకాండములు వెసం
గుప్పసఁగూర వఱప నరుఁ, [1]డప్పరుసఁదనమున కోర్చి యతఁడుం బెనఁగెన్. 298

వ. అశ్వత్థామ పెనంగు చుండ సంశప్తకవ్రజంబునందు. 299

క. చేతులు దలలును బహువిధ, హేతులఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁగించెం
జేతులకసి వోవంగ న, రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్. 300

క. తురగస్యందనపరిఘతూర్యా, భరణధ్వజచామరాతపత్రశకలముల్
పొరిఁ బొరి ధరఁ గప్పఁగ నె, త్తురుటేఱులు వానిఁ దొలఁగఁ ద్రోచుచు వచ్చెన్.

వ. అట్టియెడ. 302

తే. అంగవంగనిషాదకళింగబలము, లర్జునునిమీఁదఁ బెల్లుగ నడరుటయును
గురుసేనాధిపుఁ డాతని మురవిరోధి, నంపపెనువెల్లి ముంచి బెట్టార్చి పేర్చె.

వ. అవ్విక్రమవిశేషంబునకు రోషంబు నొంది. 304

క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వును నాసైన్యసమితి క్రూరోద్ధతియున్
నివ్వటిల నీక ఖచరులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱసెన్. 305

వ. మెఱసిన నెఱసినరోషంబున నుఱియును. 306

మ. గురుపుత్త్రుం డసురాంతకున్ విజయునిం గ్రూరాస్త్రసంతానని
ష్ఠురపాతంబున నొంప నాహరి దదాటోపంబు సైరింప క
న్నగుచుం గ్రీడి నిషధము మూఁగి చేసి తెవులు న్నగ్గింప కున్నం డని
స్ఫుర మై యుండదె యే పడంపుము రిపుసంరంభి వై నావుడున్. 307

వ. అతండు విజృంభించి గుణంబు సారించి. 308

చ. శిరమునఁ గంఠదేశమునఁ జేతులయందు నురస్స్థలంబునం
జరణములన్ శరంబులు వెసన్ నిబిడంబుగఁ గీలుకొల్పుచున్
వెరవునఁ బగ్గముల్ దునుమ వేగము యీడ్చెఁ దురంగమంబు ల
గ్గురుసుతు తేరు గయ్యమునకుం గడుదవ్వు దొలంగ భూవరా. 309

వ. ఆభూదేవుండును భగ్నోత్సాహుం డై యల్లన సూతనందనుసమీపంబునకుం జనియె నప్పుడు శౌరి సంశప్తకసైన్యంబు దెసకుం దేరు నడపుచుం దమసేనదిక్కు కోలాహలం బాకర్ణించి చూచి యట నిగిడించి యర్జును నుద్దేశించి వేదండారూఢుం డై దండధారుండు ఘనబలంబులం గలంచుచున్నవాఁ డనుగధోత్తముండు భగదత్తునంతవాఁడ యితని మడియించి మఱి చేయం గలపని సూచికొండ మని పలికిన నక్కవ్వడి యొడంబడ నక్కడ కరదంబు వోవ నిచ్చె నట్టియెడ. 310

దండధారుం డనురాజు వేదండంబుతోడ నర్జునుచేఁ జచ్చుట.

క. పాండవసైన్యంబుల వే, దండంబుల ఘోటముల రథంబుల భటులం
జండగతి మగధపతి నిజ, శుండాలముఁ బఱపి యేపుఁ జూపి తెరల్చెన్. 311

1. క. డప్పరుసన కోర్చి యప్పు డతఁడు.

వ. అవ్విక్రమవిహారంబు వీక్షించి. 312

తే. మాగధునికోర్తులకుఁ గాక ◦ మనబలంబు
విఱిగెఁ బోద పోద మని తాను ◦ దలఁకెఁ దేరు
హరియుఁ బఱపంగ నర్జునుం ◦ డడ్డపడియెఁ
జండచేష్టితోద్దండవేదండమునకు. 313

క. అగ్గలిక దండధారుఁడు, దిగ్గజనిభనిజగజంబుఁ ◦ దీవ్రత మెఱయన్
డగ్గఱఁగఁ బఱపి హయముల, నగ్గరుడధ్వజుని సఖుని ◦ నమ్ములఁ గప్పెన్. 314

చ. అలిగి కిరీటి మాగధధరాధిపుబాహులు ద్రెంచి గ్రక్కునం
దలయును ద్రుంచి యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె నప్డు గొం
దల మొకయింత లేక తనకతమ్ముఁడు దండుఁడు దాఁకి ఘోరశరం
బులు పరఁగింపఁ గేలు శిరముం గరటిం దునుమాడె నుగ్రతన్. 315

క. తదనీకంబుగజంబులు, వాఁడిమిఁ బలుగాలి మేఘములఁ దీవ్రగతిం
జెదరించుపగిది నరుఁ డు, న్మదుఁడై నలుదెసలఁ దోలె ◦ మనుజాధీశా. 316

వ. ఇవ్విధంబున మగధసైన్యంబు నుఱుమాడి సంశప్తకసైన్యంబుపైఁ గవిసి కపికేతనంబు మెఱుంగులు మెఱయ మధుమథనుపెరపున వెలిమావులగతు లక్కజంబుగా నుక్కునఁ బార్థుండు భల్లనారాచప్రముఖప్రదరపరంపరలసొంపును బాహువీర్యధైర్యంబులపెంపును నిలింపనికరంబు వర్ణింప నందు మహార్ణవంబునం దిరుగుమందరనగంబుచందంబున నిజస్యందనం బొప్ప నప్పటప్పటికి నెక్కొను కోపమదంబునం ద్రిగర్తాదు లగుసమ్మార్తురపైపయిం గ్రమ్మి కురియునస్త్రశస్త్రంబులు విదళితచ్ఛిన్నచూర్ణితంబులు సేయుచుఁ దదీయగాత్రంబులుం గరటిఘోటకతనుత్రంబులుం దునియ లయ్యెను నుగ్గు లయ్యెను బఱియ లయ్యెను గుండు లయ్యెను ధరం దొరఁగఁ దామరపాపం గేలిసల్పుసామజంబుచాడ్పున విహరించి యవిహతధృతివ్రతమహితు లగుసహితుల నత్యుత్తమలోకంబులకుం బుచ్చినం గొంచెపుమూఁక విచ్చినం బెద్ద వెనుకొనక యరదంబు మరల్చి వచ్చునెడ నచ్యుతుం డర్జును నుద్దేశించి భవద్విక్రమవిహారస్థలంబు సూచితే యని పలికి వివిధాయుధఖండంబులను వేదండాశ్వరథపదాతిశకలంబులను భూషణాతపత్రకేతుచామరాంశంబులను జక్షుశ్చమత్కరణపరిణతం బగురణస్థలంబు సూపె నప్పుడు గొఱప్రాణంబులతోఁ దొఱలునరతురగద్విరదంబులను గొందఱు దమవారిం గానక [2]కన్నీళ్లు నించుచు నాలింగనరోదనప్రముఖంబు లైనకరుణాభాషణంబు లగునవస్థావిశేషంబులం బొందువారలం గృపాళులై యాలోకించుచు నయ్యిరువురుఁ దమమోహరంబున నెసంగుకలకలంబు విని యుదీర్ణగమనంబునం జనుదెంచు చుండి రట మున్న కౌరవ్యులమొనయును గర్ణనిమొగ్గ

1. క. రయమునన్. 2. క. గ. వారలకు నీళ్లిచ్చుచు.

రంబున రెండుముఖంబులం బెనంగుచుండి కయ్యంపు[1]టుచితత్వంబునం గలసె
నట్టియెడ రారాజు పురికొల్ప రాధేయునకుఁ బ్రాపయి పుళిందబాహ్లికకేక
యాంధ్రభోజానీకంబు గవిసినం గౌంతేయబలంబునకు భరం బగుటయు. 317

మలయధ్వజుం డనుపాండ్యమహారా జశ్వత్థామచేతఁ జచ్చుట.

సీ. పాండ్యుఁ డాసేనలపైఁ బెట్టిదింబుగ, నడరి బాహాబల ◦ నుక్కజముగఁ
[2]జేరిచి పీనుంగుఁ◦బెంటగాఁ జతురంగ,ముల రూపుమాపె నయ్యలఘుభుజుఁడు
ద్రోణభీష్ములు దనకుఁ ◦ దోబుటి యనుచు, నతఁడు కోర్వఁ డచ్యుతార్జునులు దనకు
నెక్కుడు నా విన్న ◦ నెపగించుచు నుండు, నవ్వీరుఁ డస్మెయి ◦ నాక్రమింపఁ

ఆ. గని కడంగి యెనుగు ◦ చని గురుతనయుండు
నగుమఁ బగిది నీచ ◦ మృగకులంబు
గలఁచుహరియుఁబోలెఁ ◦ గలఁచెను నాదిక్కు
మొగము సేసి యనికి ◦ మొనయు మనియె. 318

చ. అన విని మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపునారసంబుఁ ద
త్తనువునఁ గ్రుచ్చి మార్గణనిపాదంబు నభంబునఁ బర్వ నంపఁ వె
ల్లి నిగుడఁ జేయుఁ ద్రోణిసుతశిలీముఖముల్ వెస నమ్మహీశుపై
ననిమిషవర్ణనీయగతి ◦ నగ్గురునందనుఁ డేసె నేసినన్. 319

వ. అంత్రొమ్మిదింటెలోన. 320

క. ప్రతిశరముల పాండ్యమహీ,పతియును [3]బరఁగింప నైన ◦ భగ్నము లయ్యెన్
గతి సెడక నిగిడి రథ్య,ప్రతతి ధరం గూల్చె నాల్గు◦బాణము లధిపా. 321

తే. మఱియు గురుపుత్రుఁ డేయ నమ్మలయకేతుఁ
డాశరంబులఁ దద్ధనుర్జ్యాలతయును
దునిమెఁ దునిమిన నతిరయంబున నతండు
నారి సంధించి యమ్ముల ◦ నభముఁ గప్పె. 322

వ. అప్పాండ్యమహీపతి పరివారసామర్థ్యంబున రథ్యవంతుం డయి వాయవ్యాస్త్రం
బున నయ్యంపపరంపరఁ బ్రతిహతంబు సేసి తదీయచక్రరక్షకులం దెగటార్చి
యార్చినం గెరలి యగ్గురునందనుండు దత్సహచరుల నుఱుమాడి రత్నమయాగురు
చందనసుందరంబైనమలయగిరిప్రకారంబునం బొలుచు కేతనంబు గూల్చి గుఱ్ఱం
బుల గీటడంగించి సూతుప్రాణంబులు గొని చాపంబు ద్రుంచి తేరు దుమురుసేసి
యతండు వాలి వానిపౌరుషంబునం బ్రయోగించునస్త్రశస్త్రంబుల నుఱుక నఱికి
యగ్గమై యున్నను గయ్యంబునలని వేడుక నతని సమయింప నొల్లక యరవాయి
గొనినయాలోనఁ బతితయోధం బైననుకల్పితమాతంగంబు నెక్కి గిరిశిఖరంబు

1. క. గ. జ. టుచితంబునం. 2. క. గ. చ. జేర్చినఁ బీనుంగుఁ బెంటలై ...రూపుమాసె. 3. క. జ. నదరింప నేసు.

సలంకరించు కేసరియట్లొప్పి యాద్రవిడేశ్వరుండు సామజంబు నుద్దామగతిం దఱిమి
భీమాభిరామం బైన తోమరంబు వైచిన మణిగణోజ్జ్వలం బైన యాగ్రామణిశిరోభూష
ణంబు ధరణిం బడినఁ ద్రొక్కంబడినభుజంగంబుపోలికం గినలి యుబ్బలుమగండు
తత్పార్శ్వవర్తుల నార్వురరథికవరులఁ దద్దండంబుతుండంబును జరణచతుష్టయం
బును సమ్మోనీపతిపాదంబులుఁ గరంబులు శిరంబును నతితీవ్రభల్లంబులం దునుమాడిన
నద్దిక్కుమూఁకలు విచ్చెం గురుభూవరుం డమ్మహీసురవరుం జేరం జని యగ్గించె
నప్పుడు. 323

క. నిలు నిలు మని తనమూఁకల, నిలిపి వృకోదరుఁడు గవిసె నీబలములపైఁ
దలకొని ధృష్టద్యుమ్నా, దులు సంరంభోద్భటముగఁ దోడ్పడి నధిపా. 324

క. [1]వారలవడి కోర్వక యు, క్కౌరవసైన్యంబు దెరలఁ గర్ణుఁడు దర్ప
స్ఫారత నదల్చి నిల్చి యుదారగతిఁ వైరిరథికతతి మార్కొనియెన్. 325

వ. అతనికి బాసట యై యడరినయశ్వత్థామానుచేతం బలువురు పాంచాలురు వ్రాలిసిరి
కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట సూపి సమీరనందనకర్ణాదు లగు
నిరువురుగురథికులపరాక్రమంబును వేఱువేఱ నిరూపించి చూపిన నతండును రథం
బు మన సేనలోనికిం బోవ ని మ్మనిన నతం డట్ల చేయ నుబ్బినపాండవానీకంబునకును
రాధేయగురుపుత్త్రులరభసంబునం బేర్చినమస మొనకును సంకులసమరం బయ్యె
నం దాకర్ణునకు ధృష్టద్యుమ్నునకుం బరస్పరశరకర్తనంబును నిశితేతరచ్ఛత్త్రకేతు
ఖండనంబును నన్యోన్యవర్మవిదారణంబును మిథశ్శరీర[2]పాతనంబును నగుసంగ్రామంబు
సెల్లె నట్టియెడ నాసూతనందనునకుం దలకడచి గురునందనుండు ద్రుపదనందను గవిసి
బ్రహ్మఘ్న నిలు నిలు మేను గలుగ నెట్లు బ్రదికెద వని పలికి వెండియు. 326

క. మాతండ్రి యెడం జేసిన, పాతకము కతంబు గాఁగఁ బాంచాలనికృ
ష్టా తునిమెద నిను నరుఁ డిట, యేతేరక యున్నఁ బాఱి కీవు నిలిచినన్. 327

వ. అన విని ధృష్టద్యుమ్నుం డతని కి ట్లనియె. 328

క. మీతండ్రి [3]కుఱికి నఱికిన, [4]హేతియ నీకొఱకు నునిచి తిపుడ నఱుకుదుర్
నీతులువపలుకులకు నీ, కైతోఁచినయుత్తరంబు నదియె దురాత్మా. 329

వ. అని యంత నిలువక. 330

తే. వినుము బ్రహ్మఘ్నుఁ డన నీకుఁ జనునె బ్రాహ్మ
ణబ్రువఘ్నుఁడ నై సమున్నతి వహించు
నన్నుఁ గిల్బిష పరుఁ డను నిన్ను జనకు
కడతుఁ బుచ్చెద వేగిరపడక నిలుము. 331

---

1. క. వారలయుఱవడి కోర్వక, కౌరవ. 2. క. ఖాతనంబును. గ. పాటనంబును. 3. క. గ. చ. కోర్కి నఱికిన. 4. క. గ. ఙ. హేతియ నీకొఱకికియును నిప్పుడునుంచితిన్. ఙ. హేతిన నీకై నకొర్కి నిపుడ నఱుకుదుర్.

వ. అనియె నట్లయ్యిరువురు నొండొరులం బరుషంబులు వలికి తలపడి వియత్తలంబు విశిఖశిఖాకలాపంబులం గప్పిరి రాధేయుండును యుధామన్యు నుత్తమౌజోద్రౌపదేయశైనేయులను మఱియుఁ జేయం గలపాండవపాంచాలయోధులను బొదివి భండనంబు సేయుచుండె నాధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రుకోదండంబు దుండంబులు సేసినం గుపితుం డై యొండువిల్లు గొని యవ్వీరుండు. 332

క. సూతతురంగస్యందన, కేతనచాపములు నఱికి కేలిమెయిన్ ను
గ్గై తొరఁగ నేసెఁ దోడ్తో, నాతతశక్తియును గదయు నతఁ డెత్తంగన్. 333

వ. అప్పాంచాలోత్తముండు వాలునుం బలకయుం గొని కవియం గడంగిన నవియును దుమురు సేసి పెల్లేసి పడ నున్న నశ్వత్థామ [1]వేగిరపడి వెఱికింపుచుఁ జేతిబాణాసనంబు విడిచి కృపాణంబు గొని భుజంగంబు దెస కఱకువిహంగపతివిధంబునఁ జనుట సూచి సవ్యసాచి శౌరి ధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రు బారిం బడియెం గావ వలయు ననుచు నద్దిక్కు సూపిన నతండు సత్త్వరుం డై యవ్వీరుం డాద్రుపదపుత్త్రుం గవిసినకొలందిఁ గ్రూరంబు లగునారాచంబులు గుప్పించుచు నొప్పించిన నమ్మహీసురవరుం డయ్యుత్సాహంబు వదలి వచ్చి యరదంబున కరుగ సహదేవుండు దన తేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె నక్కుంభసంభవసంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి బెట్టిదంబుగాఁ గనుకనిం దాఁకి యతండు నాటిన సునిశితశరంబున సోలె సారథి రథంబు గొండు వలనికిం దోలె నర్జునుం డట్లు నిజసేనానాథు రక్షించి ద్రోణిమదం బడంగించుట గనుంగొని కౌంతేయసైనికులు సింహనాదంబులు సేయ నక్కడ నిస్సాణాదులనాదం బెసంగి నింగి నిండెను. 334

తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష
కలుషితాత్ముఁ డై తలపడఁ దలఁచె నపుడు
తత్క్షణమున సంశప్తకతతియుఁ దోఁచె
రెండుఁ గని యిట్టు లనియె నాకిరీటి హరికి. 335

వ. కర్ణుండు మనల మార్కొనం గడంగెడు సంశప్తకులుం గ్రమ్మఱం [2]బొదివిరి కర్ణుచేతం దగులువడితి మేని సంశప్తకుల గొట్టించినవార మగుదుము వారలదిక్కు దేరు వోవ నిమ్ము. 336

చ. అని విని యట్ల చేసె నతఁ డర్జునుఁ డారిపుకోటి ముట్టి యే
పున నఱుమాడు చుండెఁ గురుభూవర యప్పుడు ధర్మసూతనం
దనులు సముద్ధతిం గడఁగ దండడి క్రొత్తగ వారిసేనయుఁ
మన మొనయుం బెనంగె నుపమారహితం బగువిక్రమంబునన్. 337

ఉ. సంగర మేను పెక్కుదివసంబులు సూచితిఁ గాని యెప్డు నా
భంగి మునుంగ దప్పొగుపుఁ బాటునఁ జిత్తము వోరు చుక్కయో

1. క. గ. చ. వెఱఁగుపడి చే. 2. క. ననిఁ బొదివి కర్ణు.

త్రుంగుచు నున్కి-యో [1]యెఱుఁగఁ గ దూలక పైపయిఁ గ్రమ్మిఁ గూలు సే
నాంగము లందు నింపఁ గలకోహంబుమహోగ్రత యేమి సెప్పుదున్. 338

కర్ణుఁడు పాంచాలసైన్యంబు దైన్యంబు నొందించి విజృంభించుట.

తే. అందుఁ బాంచాలవీరుల నశ్వసూత, రథసమేతంబుగా సంగరరాజు దర్ప
మెసఁగ నేపురఁ బడుపుర నేడ్వురను మహాస్త్యమార్గణములఁ దునుమాడె నధిప.

క. పదపడి పాండవయోధు, ల్వొదివినఁ బెనుఁదుంగమడుపుగొలఁకులో గజపతి యు
న్నదవృత్తిఁ గేలి సలుపుఁ, గిగ నాతఁడు [2]వోలె సురలు గీర్తన సేయన్. 340

వ. అట్టియెడ. 341

చ. ద్రుపదతనూజులుం గవలు ద్రౌపదిపుత్రులు శౌరితమ్ముఁడుం
గుపితమనస్కులై బలుపుగోల్తలఁ దాఁకి రతం డదల్చి యు
గ్రపురభసంబునన్ శరపరంపరలం బఱఁగించె గౌరవా
ధిపుహృదయంబు మోదమునఁ దేలఁగ నందఱయంగకంబులన్. 342

వ. వారలపై నక్కురుభూనాథుం డేనుఁగుకయ్యంబునకు వెరపు గలకళింగవంగాంగ
మగధసుహ్మపౌండ్రాదిదేశంబులబలంబులం గవియించిన నవి తదీయచతురంగబలం
బుల మట్టిమల్లాడి చిత్రవధవిహారంబు సలుప నగ్గజప్రధానసేన లగ్గలికం జంచి
చెండాడుచు నాదండిమగలును జేకితానప్రభద్రకులును రౌద్రరసంబునం బెనఁచినం
గనుంగొని ముదంబునం బొదలి యుత్తరించి యెరవడించిన. 343

శా. వంగాధీశుఁ గరీంద్రుం [3]దునఁగ నిర్వస్ఫూర్తి శైనేయుఁ డే
యం గేలిగతి మాద్రితేఁగొడుకు పౌండ్రాధీశ్వరుం గిట్టి యా
భంగిం గూల్పఁ దదగ్రజుం డటుల దర్పం బొప్ప సుహ్మాధినా
థుం గోపంబున ద్రుంప నేచెఁ గరటిస్తోమంబు లంతంతటన్. 344

క. విను మల్లెంచి నకులుఁ బొ, నివె నుదగ్రధ్వని ననేకవేదండము లం
డెనిమిదిటిఁ గూల్చె బాణము, లెనిమిదియెనిమిదులఁ దమ్మిఁ దెత్తెఱ నధిపా. 345

క. ఆధృష్టద్యుమ్నాదులు, గ్రోధాంధత నడరి యేనుఁగుల నస్త్రప్రహతిన్
వ్యాఘాతములుగఁ జేయుచు, రాధేయుం గదియ సంగరము పేర్చె నృపా. 346

వ. ఆసమయంబున శోణితంబు వెల్లున ము న్నెగసినరేణు వడంగిన నిరువాఁగుసైనికు
లును దమతమయడియాలంబులతోడిగొడుగులును సిడంబులును బెద్దయు మెఱసి
పెనంగు చుండ సంశప్తకసంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబు సేసినసవ్య
సాచికి శౌరి యక్కౌరవపాండవబలంబులపోరు సూపి యప్పుడు దుర్యోధనుండు
దనయందుఁ జేయంగలవారును దానును ధర్మనందనుం బట్టుతలంపున బెట్టు పొదు
పుటయు నమృతంబున కాసపడి యడరునసురుల మరల్చుశక్రాగ్నులచందంబున

1. క. గ. జ. యనఁగఁ. 2. అ. దోలె. 3. క. నదవ; గ. జ. నపుడు.

భీమసేనుండును సాత్యకియుం బ్రతిహతులం జేయుటయు నంత నిలువక య
క్కురువిభుండును గర్ణకృపాశ్వత్థామలును నుద్దామగతి నయ్యిరువురశరజాలంబుల
నమ్ములఁ జడియుచుం గదిసి యక్కొంతేయాగ్రజుకంకటంబు దుంచివైచుటయుఁ
గర్ణునుత్సాహంబునం గడంగుధార్తరాష్ట్రులసింహనాదంబులకుం దెరలక మరుత్సు
తుండు మండలప్రచారునం దగుటయు నాసూతనందనుండు మొన లగునమ్మోటిమ
గలమార్గణమ్ముల మనుజపతిపైఁ బరఁగుటయు నకులసహదేవసాత్యకిధృష్టద్యుమ్న
ద్రౌపదేయప్రభృతు లైన పాండవేయపాంచాలయోధులం గలంచి యక్కర్ణుం
డు కమలాకరంబునం గేలి సలుపుసుండాలంబులీల నటించుటయు నవ్విగుం డగ్గలిక
నక్కవ్వడిరాక గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగినయప్పరిపాటి యంతయు
నేర్పడం జెప్పి యారాధేయురభసం బుగ్గడించి మఱియు నిట్లనియె. 347

క. నినుఁ దలపడఁ జూచినయా, తనియేడ్తెఱ మంట సొరఁగఁ దలఁచుమిడుతయ
బ్బున కేన యై నాకుం దోఁ, చినయది ప్రాంపు మితని శితవిశిఖములన్. 348

వ. అని పలికి యతని కిప్పుడు దోడ్పడ నుత్సహించుభవత్సుతు నుపలక్షించి బీభత్సు
నకుం జూపి. 349

ఉ. ఇత్తఱిఁ దగ్గఱఁ జూపి నిను నేపున మార్కొని గెల్తు నన్నలం
పెత్తి సుయోధనుం డదె యనీకినిబలంబులఁ గూర్చెఁ గర్ణుతో
మత్తగజంబు లీల నెలమామిడిఁ గూల్చినభంగిఁ బాండుపు
త్రోత్తమ వీనిఁ గూల్పు మతఁ డొంటి గ రాజ్యము నీకుఁ జేకుఱున్. 350

వ. అనునవసరంబున. 351

మ. సముదాత్తోద్ధతి వాయునందనుఁడు ధృష్టద్యుమ్నుశైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి యొండొ నడర దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి వొగడం గౌరాజుసైన్యంబు లో
క్కొమొగిం బెల్లగిలంగ బెట్టుడిరె సంక్షోభాంతరంగంబులన్. 352

క. అదరి పటుబాణజాలం, బదరింపఁగ వారిబలము లధికరయము నె
క్కుడుమదము నొలయఁ బైకొని, బడలుపడఁగఁ జేసె నీదుబలముల నధిపా. 353

క. వడిఁ బొనివి భీముఁ డార్చినఁ, జెడ విఱిగినసేన నేమి సెప్పుదుఁ దనదొం
దడిఁ దాన చదిసె వెనుకొను, కడిఁగమగలచేత గాసి గాదె నరేంద్రా. 354

ఉ. మొగ్గడువాహనంబులును మోములు వాడఁగ వాహనంబుల
నిగ్గితలంగుసైనికులు నేలకుఁ గట్టపుఁజొప్పు సొప్పడం
దగ్గుసిడంబులును గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై
మ్రగ్గెడువాఁడు నై కురుధరావరుసైన్యము రూపు మాయఁగన్. 355

---

1. గ. గట్టపుటొప్పు.

ఆ. పావనికి నిషాదపతితనందనుఁడు మాఱు,కొనిన నాతఁ డతనికుంజరంబు
కరముతోఁ దదీయకరములు శిరమును, నఱకె శితశరములు నాలుగింట. 356

క. మూఁ డక్షౌహిణు లిమ్మెయిఁ, బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్త్రునియెదురన్
వేఁడిమి సూపఁగ నొకఁడు, న్వాఁడిమగఁడు లేఁడ యే మనం గల దధిపా. 357

వ. ఇవ్విధంబున విక్రమించినభీమసేనుబరవసంబును దదీయసైనికులసంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 358

క. నీచెప్పెడుమెయి సూడఁగ, నీచత వాటిల్లె మనయనీకమునకుఁ దా
రేచేటు సెడిరొ కౌరవు, లాచరిత ముపన్యసింపు మంతయుఁ దెలియన్. 359

క. అనవుడు నతఁ డిట్లను న, మ్మనుజపతికి హితులు సెప్ప మానక నీచే
సినదుర్ణయమునఁ జేటొం, దెను వగవక రణము వినుము ధీరవిచారా. 360

వ. ఇట్లు భీమునకడం కగని కవ్వడి దనమునుముకొంచెపుమాఁకలం దోలి మగిడి మన సేనల మర్దించుటకుం దమవారిఁ జేరం జనఁ గౌరవపతి యమ్మారుతి మార్కొని.

దుర్యోధనుఁడు భీమసేనుం దలపడి పోరుట.

తే. ఎందు వచ్చెదు నిలు నిలు మేను గలుగఁ, గడిఁది సెల్లునె నీకు నీక్షణము నిన్ను
నంతకునిపాలి కనిచెద ననుచు రోష, రక్తలోచనరుచుల శరములు పఱపె. 362

క. రాధేయుండు నుదీర్ణ,క్రోధుం డై గర్జితోరుగుణరవము నభో
[1]బాధం బొనర్పఁగా నిజ,యోధులఁ బురికొల్పికొని సరోషముదతిఁ గడఁగెన్. 363

వ. అట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన నది పురికొని పోరికి నడచుటయుఁ బాండవబలంబును నిరంబయి పెనంగిందోడంగె నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయంగలదొరలు దలపడి యక్కున నక్కజం బగుసమరక్రీడ సలిపి రందు. 364

సీ. కర్ణుఁ డేపారి శిఖండిరథ్యముల సా,రథిఁ గేతువును గూల్చి రయము మెఱయ
విగతాయుధుఁడు బాణవిహతాంగుఁడునుగా నుదగ్రుఁ డతఁడును నతఁడుదోలంగఁ
బాఱె దుశ్శాసనుపార్షతు లొండొరు, తనువులు నొంచుచు ననిమిషులకు
నచ్చెరు వగునట్టియని సేయ వారల, యనుచరు లెడసొచ్చి పెనఁగి రంగ

తే. రాజు సూడఁ దత్పుత్త్రసారథిశిరంబు,నకులుఁ డొకభల్లమునఁ ద్రుంపఁ జకితమైక
లంగునచ్చటిమూఁకఁ జలంబు మెఱయ, నిలిపె నాసూతసూనుండు నృపవరేణ్య. 365

వ. అట్లు సారథిరహితుం డై నవృషసేనుండు వేఱొక్కసూతు సమర్చికొని తండ్రికిం జక్రరక్షకుం డై నిలిచె నకులుండు నొండుదెస కడరె సహదేవుం డులూకుని విరథుం జేసి పఱపె సాత్యకిసౌబలు లన్యోన్యకేతుపాతనంబును బరస్పర

---

1. అ. వేధ యగుచు నిగుడఁగ నిజ; గ. బిఖిఁ బొలుపారఁగా నిజ.

కంకటకర్తనంబునుం జేసి రా శైనేయుండు దురంగంబులం జదిపిన నరదంబు డిగ్గనుఱికి యోసరించు నగ్గాంధారవిభుం గని యులూకుండు. 366

క. మును సహదేవుం డెగవం, జనినప్పుడ యొండుదేరు సవరించుకొనం
గనుట నది సేర్చి యతనిం, గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. 367

ఉ. అచ్చటిమూఁక వల్గడల నాతురతం జెడి పాఱి భీముచేఁ
జచ్చెఁ గురుక్షితీశ్వరుని సారథి గూలె హయాలి నుగ్గుగాఁ
జొచ్చె రథం బతండు వెఱ సొచ్చి ధరిత్రికి దాఁటి పోయి వె
న్నిచ్చిన నీకు యోధవరు లేర్తెఱ మార్కొని రమ్మరుత్సుతున్. 368

వ. యుధామన్యుండు గృపాచార్యుధనువు దునిమిన నప్పుహోత్తుండు వేఱొక్కవిల్లెత్తె.

ఆ. కేతనంబు గూల్చి యాతపత్త్రము దును,మాడి సూతుఁ జంపి యధికభయము
గదిరి తేరు దాని కయ్యంబునకుఁ దొలఁ,గంగఁ దోలె నతఁడు కౌరవేంద్ర. 370

క. శితశరము లుత్తమౌజుఁడు, గృతవర్మ నిమేన నింపఁ గినుకఁ గడు మూ
ర్ఛితుఁడుగఁ జేసె నతఁడు వెస, నతనిం దత్సూతుఁ డెగఁచె నరదముఁ దోలఁగన్.

అశ్వత్థామ యర్జునుం దలపడి మహాహవంబు సేయుట.

చ. గురుతనయుం డనేకరథికుల్ దనపార్శ్వములం దుదగ్రులై
దురముకడంకనైఁ దఱుమ దోర్బలశౌర్యము లుల్లసిల్ల ని
ష్ఠురశరవృష్టి ముంచె మధుసూదను మధ్యమపాండవున్ వియ
చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీనయనోత్సవంబు గన్. 372

క. అలిగి నరుఁ డైంద్ర మాదిగఁ, గలదివ్యాస్త్రంబు లేయఁ గా నగ్న్యాయు
జ్జ్వలమార్గణంబులను న, క్కలశభవసుతుండు మాన్చెఁ గౌరవముఖ్యా. 373

వ. ఇవ్విధంబున వివిధాస్త్రంబులం బోరి పోరి. 374

సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు, విజయునిదక్షిణభుజము దూఱ
మూఁ డేయు నొచ్చియుఁ బోఁడిమి సెడక య,బ్బలియుం డదల్చెఁ దత్పార్శ్వవర్తు
లగుపెనుమూఁకల నమ్ములవెల్లిఁ బే,రల్క నక్కుంభజునాత్మజుండు
రథ్యచయంబు నారాయణు వానర, ధ్వజము నవ్వీరుగాత్రమును బొదివె

తే. మెఱుఁగువాలంపగముల నస్మోయి నరుండు, గ్రాణిశోడ భరంపడి రణమొనర్చు
చుండ నట మున్న ధర్మజుఁ దురవడించి, చిత్రసేనుని నమ్ములఁ జిక్కువఱిచి. 375

క. తఱిమి తనముచుము సైన్యము, నుఱుమాడఁగఁ గని సుయోధనుఁడు మున్నగ నే
త్తెఱ నీయోధులు మార్కొని, యఱిముఱి నొప్పించి పట్ట [1]నమరి పొదివినన్.

ఉ. పావని మున్నుగాఁ గవలుఁ బార్షతుఁడుర్ వెస వారిఁ దాఁకినం
జేవ దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్రబా
ణావృతమూర్తిఁ జేసె మనుజాధిప యారథికావళిన్ ధను

1. నఱిమి.

¹జ్యావితతస్వనంబున వియద్వివరంబు ప్రపూరితంబు గన్. 377

క. అట్టియెడ ²మాద్రిపిదపట్టి, పట్టి కురునృపాలు రెండుపదు లమ్ములు దా
బెట్టుగ నేసిన వేదన, ముట్టుడుఁ జేష్టుడియె నతఁడు మొనయును దలఁకెన్. 378

మ. కని రాధేయుఁడు దివ్యబాణనిహతిం గౌంతేయసైన్యంబు నె
ల్లను నొప్పించిన బీఱువోయె నట యుల్లాసోగ్రుఁడై ధర్మనం
దను నమ్మేటిమగండు గిట్టుటయు నాతం డల్గి పెల్లేసినన్
విను మందస్మితసుందరుం డగుచు నవీర్యుండు ధీరోద్ధతిన్. 379

వ. అనేకచండకాండంబు లంగంబునం గీలించి. 380

ఆ. వలుఁదనారసంబు వక్షంబు దూఱంగ, నేయుటయును బాండవేయుఁ డార్తిఁ
గూరి నిలువ లేక కూర్చుండఁబడి సూతు, నరద మొగపు త్రోలఁగ ననియె నధిప.

వ. అనుటయు వాఁ డట్లు చేయం గౌరవులు గడంగి పోనీక పొదువ్రం దనునెలుం
గులతో నక్కౌంతేయాగ్రజు వెన్నాడి కవిసినం గేకయపాంచాలబలంబు లడ్డపడి
పెనంగె భీమసేనుండు సుయోధను నిలు నిలు మని యదల్చి యమ్ములం గప్పె
నప్పుడు రాధేయుండు రభసంబున. 382

క. పాంచాలురఁ గేకయుల ను,దంచితగర్వమున వాలుశరమ్ముల వెల్లిన్
ముంచిన నోటఱి యరికరి, పంచాననమూర్తి భీము పజ్జ కొదిఁగినన్. 383

వ. అక్కర్ణుండు నిజరథంబు మెఱయ ధర్మనందను వెనుకొనియె నతండు విశిఖవేదనం
జేష్టుడినచిత్తంబుతో శిబిరంబున కల్లనల్లన పోవుచుండియుఁ దన్ను నాసూతి
నందనుండు మూఁడుదూపుల నేసిన మరలి యమ్మేటిమగనిమేనం బలుమార్గణం
బులు సొనిపి తత్సారథి సాయకత్రయంబునను హయంబుల శరచతుష్టయంబు
నను స్రుక్కించె నట్టియెడ. 384

క. ఇరుదెసల నున్నకవ ల, న్నరపతిదురవస్థ సూచి నారాచపరం
పరలు వరఁగించుచును జెచ్చెరఁ గర్ణునిఁ దాఁకి రతఁడు చిఱున వ్రాలయన్. 385

తే. వార లిరువుర నుగ్రంపునారసములఁ
గప్పి దంతవర్ణములును ³గాలవాల
సుందరంబులు నగుధర్మనందనునితు
రంగమంబులఁ బడ నేసి రయము మెఱయ. 386

క. అతనిశిరస్త్రాణంబును, శితవిశిఖనిపాతితంబు సేసి యుదారో
ద్ధతి నకులుకార్ముకము హయ,తతియుం దునుమాడుటయు నతండును నతఁడున్.

క. సహదేవునితేరెక్కిన, సహితాంతకుఁడైనకర్ణుఁ డమ్ములవ్వార సం
పిహితశరీరులఁ జేసెను, బహువిధబాణములఁ జలము బలమును మెఱయన్. 388

చ. కనుఁగొని శల్యుఁ డి ట్లనియెఁ గర్ణునితో నిది యేల ధర్మనం

1. జ్యావిలసత్స్వనంబున. 2. మాద్రిపదపట్టి. 3. గాలివాల.

దనుపయి నాగ్రహించెదు హితం బగుకార్యమె యమ్మహీశు నీ
వనిఁ దెగటార్చినట్లయిన నర్జునుఁ డుత్కటశోకరోషముల్
వెనఁగొన నిన్నుఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు సేయకుండునే. 389

తే. ఇతఁడు దెగటాఱ నేనియు నేమిఫలము, గెలదు నన్నఁ బాలియించుట యలఘుశౌర్య
మది కురుక్షితిపాలున కఖిలరాజ్యసిద్ధియును జేయు నింక నా బుద్ధి వినుము. 390

వ. అదియునుం గాక. 391

క. వాఁడె కురుక్షితిపాలుఁడు, పోఁడిమి సెడి భీముచేతఁ బొదువఁబడియె న
వ్వాఁడిమగని కడ్డము సొ, వేఁడిమి దక్కంగఁ గలదె వేఱొకఁ డరయన్. 392

క. పవనసుతుచేత నాభూ. ధవుఁ డగ్లెనయేని నీవు ధర్మతనయునిం
గినలక సమయించుట దలఁప వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ. 393

క. అన విని యగు ప్రీత్తి భవ, త్తనయునిదెసఁ జూచి వాయుతనయునిచే నా
తనిపాదునఁబడుట యేర్పడఁ, గని రాధాతనయుఁ డతనిఁ గావఁగఁ జనియెన్. 394

క. చనుటయు సజాతశత్రుఁడు, దనశిబిరంబునకుఁ బిన్నతిమ్మునియరదం
బున నతని నతనియన్నను, గొని చనియెను సత్వరముగఁ గురుకులముఖ్యా. 395

వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందనుపలాయనం బెఱింగించె
ననుటయు. 396

ఆ. మొదలిరాజు సభయముగ నిట్లు సమరంబు, దొలఁగి చనియె నట్టి పెఱబలంబు
వారలు నిలిచి పోరు టరిది యనంతర, వృత్తసంబు విప్రవర్య చెప్పుము. 397

వ. అని యడుగుటయు. 398

చ. అనిమిషవంద్యమాన ఘనసాదరశీలసుధాయమాన స
త్త్వనలినగంధరూప విబుధద్విషదంతకర ప్రతాప సం
జనితనిరస్తకామ మునిసంఘమహార్ణవపూర్ణసోమ వే
దనికరసంవిధేయనిజతత్త్వపరిష్క్రియ నిత్యనిష్క్రియా. 399

క. ప్రమితివిదూరా సుమన, స్సమితిసమారాధనప్రసన్నాకారా
గమనాగమననిరసనా, శమనదమనసాధ్యపరమసాహోల్లసనా. 400

మాలిని. ద్విజపతివృషభాంకోదీర్ణ కారుణ్యపూర్ణా
భజననిరతరక్షాప్రౌఢ నిర్భేదరూఢా
గజదురితసముత్సేకఘ్న హృత్పద్మనిఘ్నా
యజనవిధిఫలత్వవ్యాప్త నిత్యప్రదీపా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున కర్ణపర్వంబునందు ద్వితీ
యాశ్వాసము. 402



శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## కర్ణపర్వము, తృతీయాశ్వాసము.



మచ్చరణాంబుజయుగ
శ్రీమధుమూర్తిప్రభావిలీనవిమలచే
తోమత్తభృంగభక్తజ
నామృతసరసీస్వరూప హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు కర్ణుండు కౌంతేయాగ్రజు విడిచి దుర్యోధనసంరక్షణంబునకుం జనుట విని ధృతరాష్ట్రుండు దనమనంబున. 2

క. అనిలజునకుఁ జాలఁడె నా, తనయుఁడు మోసంబు గాక ధర్మజుఁ డట్ల
బ్బినఁ బో నిచ్చుట రాధా, తనయునకుఁ బుద్ధి యగునె తప్పెం దప్పెన్. 3

వ. అని వగచి యుధిష్ఠిరుండు సనినపిదప నెత్తెఱంగున సంగరంబు సెల్లె నని యడిగిన సంజయుం డతని కిట్లనియె నట్లు సని యాధర్మతనయుండు రథావతరణంబు సేసి మందిరంబు ప్రవేశించి సెజ్జ నొడలు సేర్చి నాఁటి యున్నయమ్ములు వెఱికించుకొని హృదయంబున నమ్మెయి నున్నపరిభవంబు పీడ యొనర్ప విషాదవివర్ణుం డగుచుఁ గవలం గనుంగొని మీరు సమీరనందనుకడకుం జనుం డని చెప్పె నట మున్న నకులుం డొక్కయరదం బాయితంబు [1]సేసికొని యుండుట నయ్యిరువురుఁ ద్వరితగతిం జని యంబుదంబుచందంబున గర్జిల్లుచుఁ గౌరవులతోడం గయ్యంబు సేయుచున్నభీమసేనుఁ [2]జేరం జని యవష్టంభవిజృంభణంబునం బొలిచి రంత నప్పాండవాగ్రజు తెఱం గేమియు నెఱుంగక నరుండు ద్రోణితోడ భరంపడి రణం బొనర్చుచుండి. 4

క. నెఱి దగఁ దేజితమై గమి, మెఱుఁగు లడరునారసమున మిక్కిలివడి నే
త్తెఱ మెఱయ నురము నొంచిన, నుఱి కవ్విప్రుండు వైచె నుగ్రంపుగదన్. 5

వ. వైచిన నవ్వీరుండు. 6

చ. అది దునుమాడి మేనఁ బదియమ్ములు గ్రిమ్మఱఁ గ్రుచ్చి సూతుఁ బె
ట్టిద మగుకోలఁ గూల్చినఁ గడిందిమగంటిమిఁ దాన రథ్యసం

---

1. సేసికొనియె నయ్యిరువురుఁ. 2. సేనం దూఁచ్చి.

పదయుఁను నూలుకొల్పికొని పార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం
బొదవఁగ దేవకోటికి నృపోత్తమ యగ్గురుపుత్త్రుఁ డుగ్రుఁడై. 7

వ. అట్లద్భుతవిక్రమంబున నశ్వత్థామ విజృంభించిన సహింపక. 8

చ. హయములు పగ్గముల్ వెడఁదకోయమ్మున నుగ్గుగఁ గ్రీడి యేయుచున్
రయమున నీడ్చెఁ దేరటు దురంబునకుం దొలఁగంగ నంతయున్
భరమున నీమొనల్ గలఁగి పాఱ నరేశ్వర వారిసైన్యసం
చయ మెగసన్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్గడన్. 9

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపదన్
మీఱిన నీవె సూడఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
ల్గాఱ తలంప నీ దగుబలంబును జేవయుఁ జూపు మిత్త్రతన్. 10

వ. అనిన విని యబ్బలుమగండు మదోద్రేకంబున మద్రపతి నాలోకించి యిట్లనియె.

చ. కనుఁగొను మిప్పు డేను మురఘస్మరుఁ బార్థుని భీమసేనునిం
దునిమెద నస్త్రసంపదయు దోర్విభవంబును శౌర్యసారము
న్జనులకు నెల్లఁ దెల్లముగ నా దగుపూనిక పారవొందు మే
దిని గురునాథుఁ డొక్కఁడ యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్. 12

వ. రథరథ్యగతులు నెఱియ మెఱయ వలయుం జుమ్మీ యని పలికి విజయంబు వీక్షించి గుణంబు సారించి గాండీవంబు నీ కెనుకే యని యుగ్గించి యప్పుడు పైపయి నురవడించుపరసైనికులం జేయెత్తి యదల్చి భార్గవాస్త్రంబు ప్రయోగించిన నమ్మహానీయసాధనంబు. 13

శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావింపు మం
దేరుల్ ద్రుంగఁగ వారణంబులు ధరం ద్రెళ్లంగ నశ్వాలి ను
గ్గై రక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంతచూర్ణీకృతా
కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గౌంతేయసైన్యంబునన్. 14

వ. ఇప్పరుసున భార్గవాస్త్రబాధితం బై యప్పాండవబలంబు వెఱచఱచి మరలి పఱచిన మనమూఁకలు! వెన్నడిం దఱుమ నాసూతనందనుం డగ్లేచి యార్చి యంటం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగ లేనిమంటపగిదిఁ బ్రదీప్తుం డయినఁ దదుత్సాహంబున కోటువడి యాసైన్యంబుజనంబులు హాహాకారంబు లెసంగ దీనదశం బొంది ముకుందపురందరనందనులం జేరఁబోని యాక్రందించి రట్టియెడ. 15

ఉ. గాండివి శౌరి కిట్టు లనుఁ గర్ణునిఁ జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపు సేసి పటుదర్పము సూపుచుఁ దేఱ చూడ రా
కుండెడునట్లుగా నలుక నుగ్రత నుండెడు నిప్పు నేర్పుమై
నుండక నీసునం దొడరి యోటమి దెచ్చికొనంగ నేటికిన్. 16

క. చచ్చిన మఱి గెల్పు గొనన్, వచ్చునె తనయొడలు గలుగ వైరుల గెలువన్
వచ్చుం దఱి వచ్చిన నగి, మెచ్చు జయార్థులకు [1]మరుదమిత్రధ్వంసీ. 17

తే. పట్టపగలింటిసూర్యునిపగిదిఁ గర్ణుఁ, డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు
మనరథం బిప్డు మాధవ మరల నిమ్ము, బ్రదికియుండిన శుభములు వడయవచ్చు. 18

వ. అనిన విని వాసుదేవుండు నడుముడిఁగిక్క విలోకించునెడ నతండు కర్ణునకు మార్కొని పరాక్రమించి పాండవసైన్యంబు నిలువరించి ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి ద్రౌపదేయాదిరథికు లారథికునిం దలపడఁ దానును గౌరవులపయిం గడంగె నట్లమేటిమగనియాటోపం బప్పటికి నైననివారణంబునకుఁ జాలియునికి యనుసంధించి రాధేయుం డొకులతో నయ్యం బోవుటయుఁ బార్థుండు డప్పి దీర్చికొనుటయు మేల కాక యని యూహించి యమ్మురారి దేవ రక్కురుసేనాధిపతి సంగ్రామంబు సేయుచక్కటి కెడ గలుగం గొని చని యన్నరునితో మన మశ్వత్థామతోడి పెనంకువం జిక్కినసమయంబున ధర్మనందనుండు సూతనందనున కగ్గమై యుండె నాతం డతనియమ్ముల నొచ్చెనో యని తలంచెద నయ్యవనీశు నవస్థ యెఱింగి మఱి నీ వయ్యంగరాజు సమయింపం గలవాఁడ వనుటయు. 19

ఆ. అన్న నెచ్చె నన్నయమ్మాట చిత్తంబు, గలఁప నిజబలంబుఁ గలయఁ జూచి
యన్నరేంద్రుఁ గాన కనిలనందనుకడ, కేఁగి యడిగ నతఁడు నిట్టు లనియె. 20

ఉ. కౌరవకోటి నేఁ బొదివి క్రందుగఁ గయ్యము సేయఁ గర్ణుఁ డా
భూరమణుల్ వడిం గదిసి భూరిశరంబులు మేన నింప నో
వ్వారుటయుం దొలంగ నతఁ డాహవరంగమునందు లేఁడు నీ
వారయు మింత కెట్లగును యచ్యుతుఁ డుండఁగ నట్టు లేలగున్. 21

వ. అనిన విని వివ్వచ్చుండు వృకోదరున కిట్లనియె. 22

క. క్రూరము లగుసూతసుతుని, నారాచము లొడలఁ బెక్కు నాటినఁ జేత
స్సారము సెడి శిబిరమునకు, నారాజేఁగెనొకొ యకట యటు గా నోపున్. 23

క. ద్రోణాచార్యునియుగ్రపు, బాణంబుల కోర్చి యతఁడు వడువంతకు న
క్షీణధృతి నసమసమర, క్షోణి నిలిచి కర్ణుచేతఁ గోల్పోయెఁ గదే. 24

వ. అని పలికి యనిలనందను నాలోకించి యన్నరుం డానృపాలు తెఱం గెఱుంగుటకు నీ వరుగు మేను సేనమొగంబున నిలిచెద ననిన విని యవ్వీరుం డవ్విధంపు

1. శం ద్రమిత్రధ్వంసీ.

నడవడి నీకు నగ్రజునుం గాని, జనంబులు నన్నుఁ యినం బోరి కోపాటించి పోయె నని
యాడుదు రని చెప్పిన నప్పార్థుఁడు. 25

ఆ. సరభసముగ నన్ను । సంశప్తకులు పేరె, తోడరు చున్నవారు । దోలఁగి నాకు
నరుగ నెట్లు వచ్చు । నని చూపె నతనికి, నపుడు గడఁగి వచ్చు నబ్బలముల. 26

క. చూపుటయు నగ్గలం బగు, నేపునఁ గిమ్మీరవైరి । యేన కలఁచెదఁ
రూపు సెడఁగ నిమ్మొనలను, భూపతి నరయంగ నీవ । పొమ్మనియె నృపా. 27

కృష్ణార్జునులు ధర్మరాజుసేమం బరయ నతనిశిబిరంబునకుఁ బోవుట.

వ. అనిన నట్లకాక యని యర్జునుం డచ్యుతు నాలోకించి యీమహీపాలుం గనునంతకు
నామనంబు గలంగెడు రథంబు రయంబునం బోవ నిమ్మని పలుకుటయు నతండు
భీముం జూచి యేను మీయన్నసేమం బరయుట వలయుపని గావునం జనియెద
దము నీవుఁ గురుసైన్యంబుల జయించుట పురుదె గెలుపుగొను మని యగ్గించుటయుం
గున దీవన లిచ్చి తురంగమంబులం ద్వరితగతి నడపి నిర్వ్యాధంబున మాధవధనం
జయులు సమరంబునకు సమీరనందనుం జాలించి శిబిరంబున కరిగి ధర్మనందను
మందిరంబు ప్రవేశించి యేకతంబ శయ్యాతలంబున నున్నయన్నరపతిం గని యా
తండు కుశలి యయి యునికికి ముదంబు నొందుచుం దదీయచరణంబులకుఁ బ్రణతు
లయి రాధరణీనాథుండు వారలు రాధేయుఁ వధించి వచ్చిరకాఁ దలంచి డెందం
బలర మందస్మితంబుతో నభినందించి వారలవదనంబులు వీక్షించి యి ట్లనియె. 28

మ. సురలైనం జల మెత్తి కర్ణుని రణోత్సాహోర్జ జయింపంగ నే
ర్తురె యవ్వీరుఁడు జామదగ్న్యకలితాస్త్రం బిద్ధతేజంబునన్
దొర సప్తార్చికి లాఘవనం బవనుతోఁ । దుల్యుం[1]డగణ్యుండు సం
గరసంక్రీడలయందుఁ బేర్కొనఁ దగున్ । గాంభీర్యధైర్యంబులన్. 29

తే. అట్టిబల్లిదు ననిఁ దెగటార్చి మీర, లేమియును గాక వచ్చితి । రింతసంత
సంబు దొరకొనునే నామనంబుచింత, వంత యెల్లను జెడ నరవిన్యులార. 30

చ. అతనికి నాకునుం గలిగె । నాహవ మింతకు ముందఱం దుఁ బా
ర్షతుఁడును సత్యకాత్మజుఁడు । శాంతనవాంతకరుండు ద్రౌపదీ
సుతులును జూడఁగా నతఁడు । సూతహయధ్వజపాతనంబు సే
సి తనుఁ దీవ్రకాండములఁ । జెండఁగ నే వెగ డందితిం గడున్. 31

వ. అప్పుడు దుర్యోధనప్రభృతిధార్తరాష్ట్రులకు భీమసేనుప్రభావంబున బ్రదుకరాని
యంత పుట్టిన నన్ను విడిచి యాతం డట వోవ నే నిట వచ్చితి నని చెప్పి వెండియు
గాండీవి నుద్దేశించి. 32

---

1. డకల్యుండు - డు శల్యుండు.

సీ. పదుమూఁడువర్షముల్ ॥ పగలును రేలును, గర్ణుదర్పం బెట్లు ॥ గడతు నొక్కొ
యనుచింతఁ జేసి యాహారనిద్రలు లేక, పరితాప మందితిఁ ॥ బహువుఁ జేయ
విప్రులు పట్టరా ॥ వెఱ సొచ్చి యొదిఁగెదు, గవయంబుచాడ్పునఁ ॥ గర్ణభీతి
నుల్లల నుడుకుచు ॥ నుండుదుఁ [1]గర్ణుండు, విడువక మోమున ॥ వ్రేలు నాకు

తే. సురనదీసుతుచేతను ॥ గురునిచేతఁ, బడనిపరిభవమున వాఁడు ॥ వఱచె నన్ను
నంతయును నీఁగఁ గాంచి నీయట్టియనుజు,వలనఁ దేజంబు వడసితి ॥ నలఘుచరిత.

చ. వెరవును లావు దివ్యశరవీర్యము శౌర్యముఁ గల్గుకర్ణు నె
ప్పరుసునఁ జంపి తీ వతనిబంధులు మిత్రులుఁ బుత్రులున్ సము
ద్ధురబలు లాజికేలినిరతుల్ ధృతరాష్ట్రునిపుత్రు లెల్లఁ ద
త్పరిజను లెట్టు లట్టు లనిఁ ॥ బ్రాణము లిత్తురు వాని కడ్డమై. 34

చ. అరు దిది నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించి తాతఁ డ
క్కురుపతి సంతసింప నరుఁ ॥ గూల్చెద సంగరభూమి నేన యొ
క్కరుఁడును నీకఁ దాఁకి యనుగర్వపుమాట సనంగ నీక నేఁ
టిరణములోన నిట్లు ప్రకటింతె భవద్భుజవీర్యశౌర్యముల్. 35

చ. పలికిన నేమి బీరములు ॥ వల్కుట సేవకనీతి యాసభం
బలుకునె యట్లు జూదపునెపంబున ద్రౌపది నింతకాల మ
ప్పలుకు లలంచు చుండె మదిఁ ॥ గాయపు గీఱినయమ్ములట్ల దో
ర్బలదృఢలీల నిప్పు డవి ॥ వాపితి తీర్చి తలంత యంతయున్. 36

క. అతిగర్వ[2]సమున్నత మగు, నతనిశిరము వానివార ॥ లందఱు బాష్పో
ద్గతితోఁ జూడఁగ నమర, క్షితి డొల్లెనె విజయ నీదునిశితభల్లమునన్. 37

క. ఈరసమునఁ గదిసి శరా, సారము పైఁ గురియ నీవు ॥ సక్రోధుఁడ వై
పేరురమున వెస నాటిన,తోరం బగునారసమునఁ ॥ ద్రుళ్లి కెడసెనే. 38

వ. అనిన ధర్మనందనునకుఁ బురందరనందనుం డిట్లను నేను సంశప్తకులంతోడఁ బెనంగుచుండ ననేకరథసమూహసమేతుం డయి యశ్వత్థామ వచ్చి నన్నుం బొదివిన. 39

క. ఏనూఱురథంబులు వెసఁ, బీనుఁగుపెంటలుగఁ జేసి ॥ పేర్చినఁ గుపితుం
డై నిప్పు లురలుకన్నుల,తో నకోదండగురుసుతుఁడు నామీఁదన్. 40

క. ఉఱక యడరి మెఱసినయ,ట్లెఱ నెఱయఁగ గుదుసువడి యతిస్ఫురితరుచిన్
మెఱసి ధను వసలవలయము, తెఱఁగునఁ జక్షుర్గతి ప్రతిహతిం జేసెన్. 41

క. స్వాతిగతుం డగుశుక్రుం, డే తెఱఁగునఁ బరఁగఁ జేయు ॥ నెసకపువర్షం
బా తెఱఁగున సాయకవ,ర్షాతిశయం బావహించె ॥ నతఁడు నరేంద్రా. 42

క. తనయరదం బెద్దెసఁ జూ,చిన మొగమున వ్రేల దీప్తశితవిశిఖములన్

---

1. దన్నార్తి. 2. సమున్నతుఁ డగు.

నను ఁ గృష్ణుం గప్పిన నే, ననఘా కెల నరయఁ జాల నైతి వెగడునన్. 43

క. పదపడి యొకభంగి నశని, మద మడఁచినఁ దొలఁగఁ బాఱె మానము దూలం
దదనంతరంబ నిన్ను, న్వెదకితి నరనాథ మనయనీకములోనన్. 44

క. ఆలోఁ గర్ణునిచేతం, దూలనిచతురంగములరు దొరలను ధరణీ
పాల మసమొనలఁ గానను, వ్రాలినదర్పమున మెఱయునేవడముడిఁ దక్కన్. 45

క. ఆతనిచే నీ విక్కడ, [1]కే తెంచుట వింటి నేను మెఱుఁగుతలఁపుమై
నే తెంచితి నవ్వీరుని, చేతులలా వస్త్రదీయనేన నిలుపుటన్. 46

క. మనుజేంద్ర కుశలి వగునినుఁ, గని నామన మూఱడిల్లెఁ గావున మగుడం
జనియెదఁ గోనియెద రాధా,తనయునితల నలము నెఱయ దర్పము మెఱయన్. 47

క. నను ఁ జూడుము వేడుకతోం, జనుదెంచి భవద్బలంబు సంతస మందం
దునిమెదఁ గర్ణుని మర్కో, ధనుకోక్కియు నీమనంబునతాపముఁ దీఱన్. 48

మ. ధనురాచార్యునిచాపు నూది తగ రాధానందనుం డాసురో
ధనునిం దమ్ములవారిసైన్యములను దాఁ గాచువాఁ డ ప్రైరణం
బునకుం బూనుట నింత నేఁడు నలదే భూపాల యేపార మం
డున నీయాఱు గలదీపము ట్లతఁడు మంనేడుం గాక యే నార్చెదన్. 49

చ. నరవర సంపు మేను బ్రధనంబునఁ గేఁగి సూతసూనుఁ డు
ద్ధురత నెదిర్చె నేనిఁ దల ద్రుంపక యక్కట విప్రుఁ డోడె ని
ప్పురుసున నిచ్చువాఁ డ ని పల్కి పనంపడి యాక తక్కగు
షృరుషునిఁ జూచుమాడ్కి నను జూడుఁడు నీవును వాసుదేవుఁడున్. 50

వ. భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరం బయి యుండు నేనునుం దడయుట గర్జంబు గాదు పోయెద ననిన విని యమ్మనుజపతి గర్ణుండు గుశలి యై యుండుట యెఱింగి యతనిబాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి యక్కిరీటితో ని ట్లనియె. 51

ధర్మరాజు గర్ణుండు బ్రదికి యున్నవాఁ డని విని యర్జునుం గినిసి పలుకుట.

క. అనిలోఁ దెరలుట దొలఁగుట, యనునివి నను ఁ గాక నొచ్చి యైనను గల [2]నె
ల్లను వెడలఁ జనునె యే న, ట్లును గా కిట వచ్చుటం జులుక నైతిఁ గడున్. 52

క. విను కర్ణున కే నోడితి, నన నేటికి నీకు నోడి తనిలజమాద్రీ
తనయులు మున్నే యోడిరి, మనతోఁ గూడంగఁ గంస[3]మర్దియు నోడెన్. 53

క. కావున మన మింక ననికిం, బోవం బని లేదు విపినభూమికిఁ జని య
చ్చో వెఱపు దక్కి తపసుల, మై విచ్చలవిడిఁ జరింత మందఱముఁ దగన్. 54

క. కాదేని బిరుదు లాడక, పాదుల మై వినయ మొప్పఁ జని కురునాథుం
డే వనిచినను జేసి ద, యాదృష్టి నతండు సూచునట్లుండఁ దగున్. 55

1. 'యే తెంచుట' అనియే వ్రా. ప. 2. నెల్లను. 3. మర్దనుఁ డోడెన్.

